## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120034766

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**SaiRealAttitudeManagement**(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
| --- | --- | --- | --- |
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# కౌరవ పాండవీయం

జి. నారాయణరావు,

" కావ్యశ్రీ "

పబ్లిషర్సు :

ది చిల్డ్రన్స్ బుక్ హౌస్ (రిజిష్టర్డు)

పబ్లిషర్సు & బుక్ సెల్లర్సు

మెయిన్ రోడ్ : : గుంటూరు-౨.

కాపీరైటు] 1979 రు. 6.00

# వినతి

ACC NO 5555

ఆంధ్ర నాటక రంగ చరిత్రలో నూతనాధ్యాయాన్ని సృష్టించిన యీ "కౌరవ పాండవీయం" పౌరాణిక వచన నాటకాన్ని ప్రచురించటానికి మేమెంతో ఆనందిస్తున్నాం. ఇటువంటి రసవత్తరమైన పౌరాణిక వచన నాటకం ఇంతవరకు వెలువడ లేదు. నటనకు భావప్రకటనకు ప్రాధాన్యం కలిగి- వ్యంగ్యమైన విమర్శనలు ఆహ్లాదకరమైన హాస్యము కలిగి- అడుగడుగునా హృదయానికి గిలిగింతలు పెట్టే యీ నాటకం అన్ని తరగతుల ప్రేక్షకులను రంజింపజేస్తుంది.

భారతగాథ నిత్యనూతనం, నవరసభరితం. అటువంటి గాథను తమ మృదుమధురమైన శైలిలో-సరస రచనా విధానంతో-చక్కని నాటకంగా మలిచి ఇచ్చిన "కావ్యశ్రీ" నారాయణరావుగారికి మా అభినందనలు.

మీ అభిమాన గ్రంథ ప్రచురణ సంస్థ
ది చిల్డ్రన్స్ బుక్ హౌస్
గుంటూరు-8

894.832
NAR

# కౌరవ పాండవీయం

ఈ నాటకంలోని పాత్రలు :

1. శ్రీకృష్ణుడు
2. నారదుడు
3. ధర్మరాజు
4. భీముడు
5. అర్జునుడు
6. ద్రౌపది
7. దుర్యోధనుడు
8. భానుమతి
9. కర్ణుడు
10. శకుని
11. దుశ్శాసనుడు
12. అశ్వత్థామ

---

గమనిక

ఈ నాటకము యొక్క సర్వహక్కులు మాకు చెంది యున్నవి. మా లిఖితపూర్వకమైన అనుమతిలేనిదే యితరులు అచ్చొత్తించుట, ప్రదర్శించుట, ఇతర భాషల్లోనికి అనువదించుట, రికార్డింగ్, స్క్రీనింగ్ వగయిరాలు జరిపిన మేము జరుపు సివిల్, క్రిమినల్ వ్యవహారములకు బాధ్యులు కాగలరని తెలియజేయడమైనది.

ఇట్లు,
ప్రకాశకులు.

# నా మాట

నా నాటికలు "మానవుడు - సమర్పణ - స్వీకారం- రాబంధులు - శ్రేయోభిలాషి - వాడినపువ్వు" ఆంధ్రదేశ మంతటా చిరపరిచితాలే. మానవుడు నాటిక మదరాసు, ఢిల్లీ, బొంబాయి, కలకత్తా నగరాలలోనేగాక అండమాను దీవులలోకూడ ప్రదర్శింపబడింది. ఆనాటిక నూటపది ప్రదర్శనలకు పైగా జరుపుకొన్నది. తద్వారా కలిగిన పరిచయంతో ఆత్మీయతతో ఎంతోమంది ఔత్సాహిక నటులు చాలాకాలంగా పౌరాణిక వచన నాటకం కావాలంటున్నారు. వారి ప్రోత్సాహ ఫలితమే యీ నాటకం.

భారతగాథ అందరకు తెలిసినదే. అయినా ఇందులోని విషయాలు చాలమందికి క్రొత్తగా వింతగా ఉంటాయి. అనేకభాషలలోనున్న భారతాలకు అనేక భేదలున్నాయి. అందులో కొన్ని యీ నాటకంలో ఉన్నాయి. ఇందులోని స్త్రీ పాత్రధారణిచేత నాట్యముచేయించ వద్దని నర్తకిని వేరుగా నియమించమని సమాజాలను కోరుతున్నాను.

ప్రదర్శనలోని యిబ్బందులను - ఇతర లోపాలను తెలియపరిస్తే కృతజ్ఞతతో స్వీకరిస్తాను. తరువాత నాటకం "పాండవ విజయం" త్వరలో అందిస్తాను. సదా మీ సలహాలు ఆశీస్సులు కోరు మీ అభిమాన రచయిత.

జి. నారాయణరావు
"కావ్యశ్రీ"

# కౌరవ పాండవీయం

ప్రాతఃకాలమును దెలుపు మనోజ్ఞ వాద్య సంగీతము కొలది క్షణములు వినిపించిన తర్వాత తెరబయట నారదుడు వీణ మీటుచు పాడుచు వచ్చును.

నార : పాహి కృష్ణా ముకుందా మురారీ
హరిగోవింద రాధా మనోవిహారీ ॥పా॥

నీ లీలలు చూడంగ నెంచి
వచ్చినా నిటకు స్వర్లోకమునుంచి
ఈ లోకములో గాథలు విన్న
న్యాయ ధర్మాలకు అవకాశము సున్న ॥పా॥

ఒకరి కొకరు ఊరులు పన్నువారలు
కలరు పట్టపగలు దోచుకొనే దొరలు
పదవులకై గతులు తప్పు వృద్ధులు
కలరు ప్రజలనెత్తిని చేయిపెట్టు పెద్దలు ॥పా॥

కులమత భేదాలు, ఇరుకు పొరుగు తగాదాలు
అధికారుల విలాసాలు అమాయకుల విలాపాలు
పక్షపాత ప్రభుత్వాలు దక్షిణ బంధుత్వాలు
ఈ లోకము ధర్మములా! నీలీలల మర్మములా! ॥పా॥

మాయా తీతుడవయ్యు మనుజులకొరకై
వేషములే వేయుదువా నటన సూత్రధారుడవై
ఏమి చిత్రమోగాని ఎన్ని సార్లు విన్న నూ
నీలీలలు క్రొత్తవిగా తోచునెల్ల వేళనూ ॥పా॥

[పాట పూర్తికాగానే కన్నులుమూసి కరాలుమోడ్చి "శ్రీకృష్ణాయ నమః హరిఃఓం అనును. వెంటనే ఆ"ఓం"తో కలసి లోపలనుంచి దుర్యోధనుని శివస్తోత్రము "ఓం నమఃశివాయః" అని ప్రారంభమగును. అది విని నారదుడు సంభ్రమానందముల నందును. తెరలోనుంచి దుర్యోధనుని శివస్తోత్రము వినిపించును.]

ప్రఫుల్ల నీలపంకజ ప్రపంచ కాలిమ ప్రభా
వలంబి కంఠ కందళీరుచి ప్రబద్ధ కంధరం
స్మరచ్ఛిదం పురచ్ఛిదం భవచ్ఛిదం మఖచ్ఛిదం
గజచ్ఛిదాం ధకచ్ఛిదంతమంతకచ్ఛిదం భజే

[సాలోచనగా] ఎవరీశివస్తోత్రము చేయునది! ఓహో! తెలిసినది – తెలిసినది! దుర్యోధన సార్వభౌముడే! కౌరవ ప్రసాదమే కదా యిది! ఈ దుర్యోధనుని శివపూజ పరాయణత్వము రావణాసురుని స్ఫురింప జేయుచున్నదే! లోని కరిగి నాయాకలితీరు ఉపాయమునకు ఉపాధి కల్పింతును.

[వెళ్ళిపోవును]

[వెంటనే తెరలేచును, అది దుర్యోధనుని అంతఃపురములోని విలాస క్రీడామండపము, ఉచితాసనములు అందముగా అమర్చబడి యున్నవి ఒక ప్రక్కగా చదరంగ పీఠము, దానికిరువైపులా నాసనములు మన్నవి; ఎత్తుగామన్న పీఠముపై గల రత్నకంబళిపై కూర్చుని భానుమతి వీణవాయించు చున్నది. అగరుధూపములు కమ్మనివాసనలు వెదజల్లు చున్నవి.]

భాను: ఆగదు మోహనరాగం
దాగదు మాగిన నాయనురాగం ॥ఆ॥

నిను నేకన్నుల నిలుపు కొంటిరా
నను నీ నీడగ నిలువనీయరా
అలనై కలనై కరిగిపోదురా
తలపై వలపై మరిగిపోదురా ॥ఆ॥

నా మదిలోన రగిలే విరహం
నీ యెదలోన తగిలే మోహం
ఒకటై తీగలు సాగిన స్నేహం
ఎన్నటికీ తనివోందని దాహం ॥ఆ॥

[దుర్యోధనుడు సవిలాసముగా లోపలనుంచి వచ్చును. అతనిని చూచి రాజనర్తకి తలవంచి నమస్కరించి లోనికి వెళ్ళిపోవును. భానుమతి లేచి ఎదురేగి చిరునవ్వుతో నమస్కరించును.]

భాను: ఆర్యపుత్రులకు ప్రణయాభి వాదములు !

దుర్యో : దేవీ! వీణాగానం ఆగిపోయిందేం!

భాను: తమనుచూచి మూగవోయింది ప్రభూ!

దుర్యో: ఎందుకని!

భాను: తంత్రుల తంత్రాల నెరిగినవారు కదాయని!

దుర్యో : నీకమ్మని గళరవాలతో దాని నలరించి పలికించు.

భాను: తమనుచూచి మూగవోయిన ముగ్ధకు నాపాడకిట్టదు. కదా! తమ కరగ్రహణముతోగాని అది పులకించదు ప్రభూ!

దుర్యో: (నవ్వి) వీణను మించిన రాగమయజాణవు !

భాను: ముగ్ధలను మురిపించుటలో సిద్ధహస్తులుకదా మీరు! తమస్పర్శ తగలగానే దాని నవనాడులు చలించి అనురాగముతో నవరాగ మాలపించదా ప్రభూ!

దుర్యో: నిజమా దేవీ!

భాను: మీ పాణిగ్రహణముతో కలిగిన దాని మధురమంజుల మణిత ధ్వనులు నేను వినగోరుదును ప్రభూ!

దుర్యో: అటులే కానిమ్ము, నీ కేదుకలు మా కానతులు. (వీణ తీసికొని వాయించుచు) దేవీ! ఆపకు నీగానం!

భాను : ఆగదు వీణగానం

సాగదురా చెలికాడా మానం ॥ఆ॥
వయసూ సొగసూ నేనై వెలయ
వలపూ రేయీ వెన్నెలకోయీ
భువిలో స్వర్గము నీదేనోయీ ॥ఆ॥

కర్ణు : (బయటనుంచి వచ్చి) అద్భుతము! అత్యద్భుతము! ఇది రాజరాజు విలాసమందిరమా - దేవరాజు విహార నందనమా! కిన్నెర ద్వయమే పుడమిపై అవతరించినదా! గంధర్వమిథునమే దివినుండిభువికి దిగివచ్చినదా!

దుర్యో: రావోయి కర్ణా! రా!

భాను : సోదరునకు స్వాగతము

కర్ణు : అమ్మా! భానుమతీ మహారాజ్ఞీ! మీ మధుర గానానికి కురుసార్వభౌముని వీణావాదనం వెన్నెలలకు పరిమళమబ్బినట్టుగా ఎంత మనోజ్ఞముగా నున్నది!

భాను : అన్నా! మీనెచ్చెలి చదరంగ రణరంగము మిలందే గాదు-ముదితల యెద రంగరించుటలో గూడా మూర్ధాభిషిక్తులే!

కర్ణు రారాజు సాహచర్యములో కళత్రముగా మీరు మిత్రుడుగా నేను ధన్యులమైతిమమ్మా!

భాను: యదార్థము! చక్రవర్తి భార్యగాకన్న మనసిచ్చిన మనోహరుని అర్ధాంగిగా నే నెక్కువ అదృష్టవంతురాలిని.

కర్ణు : నిజమేనమ్మా! స్త్రీకి పతి యభిమానమును మించిన బహుమాన మేమున్నది ? పూవును తావివంటి మీ దాంపత్యము జగదాదర్శము!

దుర్యో: [లేచివచ్చి] కర్ణా! అయినవా నీ అభినందనలు !

కర్ణు : సార్వభౌమా! మిమ్ముల నభినందింపగల వాక్చాతుర్యము నాకు లేదు. ఉన్నదున్నట్లు మాత్రమే చెప్పగలను

దుర్యో: [నవ్వి] ఇదీ నిజమైన వాక్చాతుర్యము ! రాధేయా! వృధాలాపాలతో ప్రొద్దుపుచ్చకవచ్చి ఎత్తు వేయుము. చదరంగము మనకై యెదురుచూచుచున్నది. [బల్ల ముందు కూర్చుండును]

కర్ణు : తమ ఆజ్ఞ! [రెండవప్రక్క కూర్చుండును]

భాను: ఆట మైకములో మీకు ఘంటారావము వినిపించక పోవచ్చును. వేళను సూచించుటకిక్కడ నొక సేవికను నిలుపమందురా !

దుర్యో: ఆటకు ఆటవెలదికి లోబడినవారు సేవకుల సూచనలే కాదు సహధర్మచారిణి పలుకులు మాత్రమాలింతురా!

భాను: అటువంటి ప్రమాదము జరుగకుండ నన్నే కాపుండమందురా!

కర్ణ: అమ్మా భానుమతీ మహారాజ్ఞీ! అందులకు కాకపోయినను మరొకందుకైన మీరిక్కడుండవలసినదే!

భాను: ఎందులకన్నా?

కర్ణ: న్యాయనిర్ణేతలు లేకుండ పందెమాడరాదు. మా జయాపజయములను నిర్ణయించు బాధ్యతమీది.

దుర్యో: అవును. దేవీ నీవుకూడా చదరంగమున ప్రాజ్ఞురాలవే కదా!

భాను: సరియే ప్రభూ! ఇక ఆట ప్రారంభించుడు.

కర్ణ: [ఎత్తువేసి] మా భటులు విజృంభించినారు.

దుర్యో: [ఎత్తువేసి] మా అశ్వము లంఘించినది.

కర్ణ: [ఎత్తువేసి] మా శకటము మీ మంత్రిపై బడినది.

దుర్యో: [ఎత్తువేసి] నీ శకటము కూలినది కర్ణా!

భాను: బలగమును చంపుకొనుట మంచిదికాదు.

దుశ్శా: [బయటనుంచి వచ్చి] వదినగారికి వందనం!

భాను: ఏమయ్యా దుశ్శాసనా!

దుశ్శా: అన్నగారిని తీసికొనిరమ్మని పితృదేవుల యాజ్ఞ.

దుర్యో: దుశ్శాసనా! ఏమిటా రాచకార్యము!

దుశ్శా: తాతాచార్యులు – గురుదేవులు – కృపాశ్వత్థాములు జనకునితో మాట్లాడుచున్నారు. తమను తోడ్కొని రమ్మని నన్నంపిరి. తమకై వేచియున్నారు.

దుర్యో: మంచిది! ఇపుడే పోవుదము.

కర్ణు : ఆట మధ్యలో నున్నది.

దుర్యో: ఆట మధ్యలో లేచిపోవుట యుద్ధరంగమునుంచి పారిపోవుటవంటిదే ! పురోగమనమేగాని తిరోగమన మెరుగని యీ దుర్యోధన చక్రవర్తి అందుల కంగీక రింపడు కానీ అతిముఖ్యమైన పనియున్నగాని మా తండ్రి నాకు కబురంపరు. నేనాలసించుట మంచిది కాదు దేవీ! నేను వచ్చువరకు నాయాట నీవాడుము.

భాను: నేనా ప్రభూ!

దుర్యో: అవును దేవీ! నీ వెందులో తీసిపోదువు? అన్నమీాది అభిమానముతో భర్తకు పరాజయము మంటగట్టకుము.

భాను: భర్త పరాజయము భార్యకు దుర్మరణము ప్రభూ!

కర్ణు : ఆదర్శ మహిళవమ్మా! మహారాజ్ఞీ!

దుర్యో: సరియే! మీారాడుచుండుడు. తమ్ముడా రమ్ము!
(దుశ్శాసనుని చేయిపట్టుకొని తీసికొనిపోవును)

భాను: అన్నా! ఎత్తువేయు వంతుమీాది.

కర్ణు : మీాశకటము వ్యూహాములో చిక్కుకొన్నది. (ఆడును)

భాను: మా గజము వ్యూహామును ఛేదించుచున్నది.

కర్ణు : మీ గజమునకు రక్షణయేది?

భాను: ఇదిగో మా మంత్రి రంగములోనికి వచ్చినాడు.

[వేయును]

శకుని : (బయటనుంచి తొందరగా వచ్చి) నాయనా దుర్యోధనా!

భాను: నాన్నగారు! వారు మామగారిని చూడబోయిరే!

కర్ణు : శకునిమంత్రీ! ఏలనో ఆరాటపడుచున్నారు!

శకుని: ఆరాటముగాక ఆనందముగా వినోదించు సమయమా ?

కర్ణు : ఏమైనది శకునిమంత్రీ?

శకుని: పాండవులు లక్కయింటి నుండి బయటపడి మత్స్య యంత్రమును గొట్టి ద్రౌపదిని పెండ్లాడి రాగానే వారి కర్థ రాజ్యమిచ్చి ఇంద్రప్రస్థమునకు బంపినాడు కదా ధృతరాష్ట్రుడు! అదియే మనకొంప ముంచినది.

కర్ణు : వివరముగా చెప్పవయ్యా మహామంత్రీ ?

శకుని: శ్రీకృష్ణుని మాయా బలముతో పాండవులు మన సామంతులను గెలిచి రాజసూయయాగము చేయుచున్నారట! అందులకై మన కాహ్వానము వచ్చినది.

భాను: సుహృద్భావమునకది నిదర్శనము కదా!

శకుని: కాదమ్మా భానుమతీ! రాజసూయము చేయుటన్న తమ ఆధిక్యతను ప్రకటించుట! మన సామంతులను గెలిచి వారిదగ్గర కప్పములు గ్రహించుట మన సార్వభౌమత్వమును తిరస్కరించుట. ఇప్పుడు పాండవులు

మనకు సామంతులా సార్వభౌములా ! లేక ఇరువురము స్వతంత్రులమేనా ?

కర్ణు : అదెట్లు! ఒక ఒరలో రెండు కత్తులా !

శకుని: అదియే యిప్పుడు తేలవలసినది.

కర్ణు : అవును తేల్చవలసినదే! రారాజును రానిమ్ము.

శకుని : నేనేపోయి అక్కడే మాట్లాడుదును. [వెళ్ళిపోవును]

కర్ణు : అమ్మా! ఆట పరికింపుడు. [ఎత్తువేసి] మీ మంత్రి పెడదారిన బట్టినాడు. అతనిపై నాధారపడినచో మీ రాజునకు పరాజయము తప్పదు. సరిగా నాలోచించి రాజును రక్షించుకొనుడు.

భాను: మహారథములుండగా మారాజునకు వచ్చిన భయమేమున్నదన్నా! [ఎత్తువేసి] చూడుమన్నా మా అశ్వము అష్టదిగ్బంధము చేసి మీ పరివార విజృంభణ మరికట్టినది. ఇప్పుడేమందువన్నా!

కర్ణు ; సరియేనమ్మా! ఈ యెత్తుతో మీరాజు చిత్తుగాక తప్పదు. [ఎత్తువేసి] తరువాతి ఎత్తుతో మీ ఆటకట్టు ! ఇంక మీ రాజెటుపోవును?

దుర్యో: [బయటనుంచి వచ్చుచుండును]

భాను: [చూచి–లేచి–తప్పుకొనబోవును]

కర్ణు : ఎత్తువేయక కదలరాదు. [చటుక్కున చేయిచాచి పైట చెంగు పట్టుకొనుచు పైట పైనుంచి బిగించికట్టిన వడ్డాణము తెగిపడును. ముత్యములు చెల్లాచెదురగును.

భా‌ను: [అడుగు ముందుకు వేయలేక బిత్తరపోయి వెను దిరిగి చూచి-భర్తనుచూచి తొట్రుపడును.]

దుర్యో: [సంతోషముగా] ఓహో! ఏమిమనోహర భంగిమ! ఉరిలో చిక్కిన హరిణివలె-హరియెదుటైన కరివలె-రాహువు దరిజేరిన రాకేందునివలె-ఎంత విషాద ముద్రను ప్రదర్శించితివి దేవీ!

కర్ణ: [చెంగువిడిచి కంగారుగా లేచును]

భాను: [విస్మయముతో] ప్రభూ! [దూరముగా వెళ్ళును]

దుర్యో: దేవీ! దేవీ! వదలకు!.... అహో! ఎంతచక్కటి భంగిమను భగ్నము చేసితిని! భర్తను చూచిన యానందము-పరపురుషుడు చెంగు పట్టినందుల కాగ్రహము-అమాయకముగా అవధులు దాటిన అన్నవంటి అంగరాజువై జాలి-ఒక్కుమ్మడిగా ముప్పిరిగొని నీ కన్నులలో మెరయ-కవులూహించలేని-శిల్పులు చెక్కలేని అత్యద్భుత భంగిమను ప్రదర్శించితివే! ప్రదర్శించి తనివార చూడకుండ చేసితివే!

కర్ణ: [సిగ్గుపడి] అమ్మా! నన్ను క్షమించుము! ఆటమీద గలతమి పెల్లిదముతో విచక్షణాహీనుడనై అపరాధము చేసితిని. మన్నించు మహారాజ్ఞీ.

దుర్యో: కర్ణా! ఎందులకా వెలతనము. ఆ దోషము చవిరంగా నిదే గాని చతురులది కాదు. దోషమేమైనను అదినాకు మహానందము నిచ్చినది,

కర్ణ : అదెట్లు కురుసార్వభౌమా!

దుర్యో : ఇన్ని నాళ్ళుగా భానుమతిదేవితో కాపురము చేయుచున్ననూ ఎప్పుడూ చూడనోచని మనోహర భంగిమా కళావిన్యాసమును నేడు చూడగలిగితిని. మేనక చెంత విశ్వామిత్రుడు ఊర్వశి సన్నిధిలో పురూరవుడు - రంభాసాన్నిధ్యములో దేవేంద్రుడు సైతమింతటి కళావిలాసాన్ని దర్శించియుండరు.

భాను: ప్రభూ! ఇక మీ వర్ణనలు చాలింతురా?

కర్ణ : అమ్మా! నన్ను మన్నించితిరా?

భాను: అన్నా! ఇందు జరిగిన నేరమేమున్నది? నీ పవిత్ర మాతృభావము నాకు తెలియదా ? ఇక నా ప్రస్తావన చాలించి మీ ఆట సంగతి చూచుట మంచిది. ప్రభూ! నాకు సెలవు. మన్నింతురుగాక. (లోనికి వెళ్ళును)

[వెంటనే బయటనుంచి నారదుడు-శకుని-దుశ్శాసనుడు వత్తురు. చదరంగ పీఠము దగ్గరకు వెళ్ళుచున్న దుర్యోధనుడు వారినిచూచి ఆగిపోవును.]

దుర్యో; నారద మునీంద్రులకు ప్రణామములు.

నార : సకలైశ్వర్య ప్రాప్తిరస్తు!

దుర్యో: అంతకన్న అక్కరలేని దీవెనలేదా మునీంద్రా!

నార ; నీకు లేనిది మాత్రమే మున్నదయ్యా ?

కర్ణ : మునిపుంగవులకు వందనములు! (పాదములంటును)

నార : ఓహో! సూతపుత్రు డిక్కడనే ఉన్నాడా?

కర్ణ : మునివర్యా బ్రహ్మమానస పుత్రులనీ బ్రహ్మర్షి వరులనీ భక్తి ప్రవత్తులతో పాదములంటి ప్రణామము లాచరించితిని.

శకు ; వేదవేదాంగ పండితుడవుగాన తగినట్లే చేసితివి.

కర్ణ ; కాని కలిగినదేమిటి? ఆశాభంగము! పైగా సూత పుత్రుడనని నాకులముదెప్పి నా మనసు నొప్పించినారు. ఈ కులభేదములు మానవులకేగాక మహర్షులకు మహాత్ములకు గూడ కలవన్నమాట !

దుశ్శా; చిన్నప్పటినుంచి నిన్ను చెడగొట్టుచున్న దీకులభేదమే కదా.

శకు ; కులభేదము లేకున్న ఈ యుగచరిత్ర మెటులుండునో

కర్ణ ; నిండుమనసుతో చేసిన వందన స్వీకరించుటకు–స్వీకరించి చేయెత్తి దీవించుటకు గూడ కులమడ్డు పడినదా!

నార ; (నవ్వి) రాధేయా! ఆజన్మ కవచకుండల ధారివై–ప్రభాకర తేజోవిరాజితుడవై–అవక్ర పరాక్రమ విక్రముడవై–అధినేతకు అనుంగు చెలికాడవై – దాన వీర శూర బిరుదాంకితుడవైన నిన్ను ఇంకేమని దీవించవలయునా అని ఆలోచించుచున్న నా నిర్వచనమునకు చక్కటి నిర్వచనమే చెప్పితివయ్యా!

దుర్యో ; చాలు! దీవించవలయునని మనసున్న దీవించినట్లే. ఆతిథ్యము గైకొందురుగాని లోనికి రండు మునీంద్రా!

నార ; ఇప్పుడే విదురునింట ముగిసినది.

దుర్యో; అయిన ఆ సువర్ణాసన మలంకరింపుడు.

(నారదునితో బాటు అందరు కూర్చుందురు)

నార ; సుయోధనా! నీవింకను ప్రయాణము కాలేదమయ్యా!

దుర్యో ; ఎక్కడకు మునీంద్రా!

నార ; ఇంద్రప్రస్థ నగరానికి

శకు ; పాండవ రాజసూయము చూచుటకేనా !

నార ; అవును. రారాజున కాహ్వానము రాలేదా !

దుర్యో; వచ్చినది. అదియే ఆలోచన.

నార ; ఏమని !

శకు ; ధృతరాష్ట్రుని కాదని తమంత తాము పెద్దలై ఒక సామ్రాట్టు తన సామంతునకు బంపినట్లుగా పంపిన ఆహ్వానము నంగీకరించుటా కాదా అని.

దుశ్శా: అక్కడకు వెళ్ళినచో మనము కూడా వారి సామంతులుగా పరిగణింపబడుదుమేమో అని-

కర్ణ ; అంతేకాదు, ఇంతవరకు కౌరవు పేరుమీదుగా కురు వంశమనీ – కౌరవులనీ వ్యవహరింపబడుచున్న వంశ నామమును పరిత్యజించి తను తండ్రితోనే తమ వంశ మారంభమైనట్లుగా పాండవులమని చాటుకొనుచున్న వారితో బంధుత్వ మేమిటా అని !

నార : దుర్యోధనా! నీయభిప్రాయములు నీకన్న ముందుగా కర్ణ శకుని దుశ్శాసనులే చెప్పుచున్నారే!

దుర్యో : వారి యభిప్రాయములే నా యభిప్రాయములు గావున.

నార: అయిన నీ సొంత మొక్కటియు లేదన్న మాట! అదియే మంచిది. పాలకులకు అభిప్రాయములుండుట ప్రమాదము. అది సరియేగాని సౌబలా! కురుపాండవ వైరమునకు కారణ మేమందువు!

శకు ; దాయాదులు రాజ్యభాగము కోరుటయే.

నార; నేను మరియొక కారణము వింటిని !

శకు ; ఏమిటది నారద మునీంద్రా!

నార; బకుడు-జరాసంధులు-కీచకుడు-దుర్యోధనుడు - భీముడు అను నీ యేవురిలో మొదట ఎవరొకరిని చంపునో వాడే తక్కిన ముగ్గురనుకూడ చంపునని శాపమున్నదట నిజమేనా!

శకు ; నిజమే మునీంద్రా!

నార ; మరి భీముడు బక జరాసంధులను చంపెనుగదా!

దుర్యో ; చాలింపుడు మీ వ్యంగ వచనా ప్రసంగము.

దుశ్శా; ఆకలిగొన్న బకుని అన్నముతిందువుగాని రమ్మని పిలిచి వంచించి చంపుటకూడ మగతనమేనా ? అది భీముని విజయముకాదు-అతని మోసమునకు నిదర్శనము.

కర్ణు ; కృష్ణుడు మోసము చేయకున్న జరాసంధుడు మరణించునా ?

నార ; అటువంటి మోసము మరియొకమారు జరుగకుండ చూడుమయ్యా గాంగేయా!

కర్ణు : అక్కరలేదు మునీంద్రా ! మా కురుచక్రవర్తికి మరి యొకరి సాయమక్కరలేదు. భీముని గదాకౌశలము కుమారాస్త్రవిద్యా ప్రదర్శన నాడే బట్టబయలైనది కదా. ద్రోణాచార్యు డడ్డుపడి విడదీయకున్నచో భీము డానాడే రారాజు చేతిలో మరణించి యుండును. సుయోధనుడు తొడగొట్టి నిలిచినచో బలరాముడు సైతము భయపడవలసినదే!

నార: తొడగొట్టు వ్యవహారము నాకేమి తెలియును, భీమునకు తెలుసు—ఆపైన భగవంతునకు తెలుసు!

శకు : కర్ణుడుండగా సుయోధనునిపై యోగమైన వ్రాలదు.

నార : కర్ణుని పాలిట అర్జునుడున్నాడు కదా.

దుశ్శా: అర్జునుడు మాకర్ణుని ఎడమ చేతికైన ఈడువచ్చునా ?

నార : ఆసంగతి సవ్యసాచి కెరుక ! అటుపై సర్వసాక్షి కెరుక!

దుర్యో: కులగోత్ర ప్రశ్నలు దెచ్చి లజ్జానిర్జీవునిగా చేయు కృపాశ్వత్థామలే లేకపోయిన కుమారాస్త్ర విద్యా ప్రదర్శనమునాడే కర్ణార్జునుల తులారణములో అర్జునుడు నిర్జీవుడయ్యెడివాడు. మాకర్ణుని జగదేకవీరత్వమానాడే జగద్విఖ్యాతమయ్యెడిది.

నార : ఆరుగురి శాపములు తగులుటవల్లనే కాబోలు కర్ణుని ప్రతాపము బయటపడకున్నది. అందువల్లనే మత్స్య యంత్రము కేశము వాసిలో తప్పిపోయినది.

కర్ణు : అవి శాపములుగావు. కులవిద్వేషముతో బంధు పక్షపాతముతో మీ పెద్దలు చేసిన పాపములు. ఈ కుల తత్వము కారణముగా నాకు జరిగిన అన్యాయము నా మృతితో చరిత్రలో శాశ్వతముగా నిలిచి ముందు తరాలవారికి కనువిప్పు కలిగించిన అంతియే చాలు. ఒక కర్ణుడు-ఒక ఏకలవ్యుడు నశించినను నష్టము లేదు. కోటానుకోట్ల కర్ణులు-ఏకలవ్యులు జాగ్రత్తపడగలరు!

నార : [నవ్వి] రాయిచాలాదూరము విసిరితివయ్యా రాధేయా నీ హృదయావేదన నాకర్థమైనది. ప్రతీకారమాలోచింపుము. అది సరియేగాని సుయోధనా! మయసభ చూచుటకైన ఇంద్రప్రస్థమునకు వెళ్ళవలయునయ్యా!

దుర్యో: అంతటిదా మయసభ !

నార : దాని శిల్పకళా వైభవము వర్ణింప నెవరితరము ! అది భూవలయములో అపూర్వము. సర్వమనోజ్ఞము. పైగా ఇష్టభోగావహము. నిర్మల స్ఫటికశిలానిర్మితమై శశి ప్రకాశమానమై వివిధ రత్న ప్రభాభాసురమై నిత్య నూతనముగా అలరారు చున్నది.

దుర్యో: అయిన తప్పక చూడవలసినదే.

శకు : అంతేకాదు. సామంతులకే యట్టి సభ యున్న చక్రవర్తివైన నీకు అంతకు వేయంతలు ఘనమైన సభ కావలసినదే!

దుర్యో : అవును మామా! అందులకే మనమందర మాసభను తప్పక చూడవలయును.

నార : ప్రయాణముకండు కలిసియే పోవుదము,

దుర్యో : మామా! మీరును రాధేయ దుశ్శాసనులుకూడ నాతో రావలయును. పయనముకండు.

శకు : నేను సిద్ధమే! మీరు పయనమైరండు. అంతవరకు నిచ్చట నేను నారద మునీంద్రునితో మాట్లాడు చుందును.

దుర్యో : మంచిది కర్ణా! దుశ్శాసనా! వేగముచని వైళము రండు. (లోనికి వెళ్లును) (కర్ణదుశ్శాసనులు బయటకు వెళ్ళుదురు)

నార : సౌబలా! కాలము నీకు కలసి వచ్చుచున్నదయ్యా.

శకు : ఎందుకు స్వామీ!

నార : నీవు వెంటలేకున్న దుర్యోధనునకు చెడిపోవు బుద్ధు లెట్లుపుట్టును? పుట్టక నీయాశయమెట్లు సిద్ధించును!

శకు : నాపై నిందారోపణకు నాంది పలికిరి కదా! ఇక లోకులు కాకులై కూయుదురు. ఏమి చేయుదును? మీ తండ్రి నానొసటను వ్రాసిన వ్రాతయది. పోనిండు. శ్రీకృష్ణునకు చేదోడుగానున్నను వాదోడుగనైన నుంటి నన్నదే నాకుతృప్తి!

నార : అందులకే శ్రీకృష్ణునకు నీపై నంత యభిమానము.

శకు : అందలి ఆంతర్యము తమకు తెలియనిది కాదు.

నార : అవును ఈశ్వర వరప్రసాదియై శాపగ్రస్తుడై కలి యంశతో దుర్యోధనుడై పుట్టిన సువర్ణహస్తుడ-భీష్ముడై పుట్టిన అష్టమ వసువు-కర్ణుడై పుట్టిన సహస్ర కవచుడు మొదలైన కారణ జన్ములందరు చావవలసి నదే! ద్రౌపదిగా అవతరించిన లక్ష్మీదేవి బ్రహ్మ హత్యాదోషము తొలగవలసినదే! మరి నీ మహోమా రణమంత్రమును మహారాజుతో చాలింతువా లేక మహా జనానికి కూడ వర్తింప జేతువా!

శకు : పదునెనిమిది అక్షౌహిణీలలెక్క సరిపోవలదాస్వామీ!

నార : అక్షరాల! ఒక్కటికూడ తక్కువకాకూడదే!

శకు : కావుననే యథారాజా తథాప్రజా!

నార : ఓహో: ఆర్యోక్తికి చక్కని అర్థాంతరమునే చెప్పితివే! ఆదర్శ సచివుడయ్యా సౌబలా!

శకు : ఇందులో నేను చేయునదేమున్నది? పరమాత్ముని కార్యమునకు సాయపడుచుంటిని. అంతియేకదా!

నార : పరమాత్మునకు నీ సాయమా!

శకు : ఎందులకు కాకూడదు? వెనుకటి యవతారములో వానర సహాయ మర్థించలేదా!

నార : కాని మార్గములందు భేదమున్నదికదా.

శకు : అది అధికారుల నిరంకుశాధికారమునకు - పక్షపాత బుద్ధికి నిదర్శనము. సృష్టిచేసి కర్మములు ధర్మములు నొసటను వ్రాయు నధికారముగల మీా తండ్రియైన

బ్రహ్మదేవుడు - తన తండ్రియైన విష్ణుదేవునకు దుష్ట శిక్షణా దురంధరుడని పట్టముగట్టి అతని యనుచరులకు భక్తిపరాయణులని బిరుద ప్రదానము చేసినాడు. వెనుకకు దేవతా తంత్రములులేని మావంటి వారల నొసట చెడు మార్గములువ్రాసి ప్రజలచే మాపై దుష్కీర్తి పోయించుచున్నాడు. పెత్తనము చేయు పెద్దల ఇష్టాఇష్టములను బట్టియే క్రిందివారి జాతక ములు వ్రాయబడుచుండును.

నార : బాగున్నదయ్యా శకుని మంత్రీ! నీవు మా తండ్రి కిచ్చిన వాగ్దానము నిలుపుకొనుటకై ఏమేమో చేయుచు మధ్యను మా తండ్రిపై విరుదేకు పడెద వేల ?

శకు : నా ప్రయత్నము - మా కలహాభోజన క్రియత్వము అన్నియు కలసియే వచ్చినవి.

నార: నాకలహములు లోక కళ్యాణ కరములు!

శకు : మా తండ్రికి గల పక్షపాతబుద్ధియే అందులకు కార ణము. మనముచేయుపని యొక్కటేయైనను లోక ములో మీకున్న మంచి పేరు నాకు లేదు. ఎట్లుండును! నుదుటివ్రాత కావలయును. ఆ వ్రాతలు వ్రాయు సాధ నము మీతండ్రి చేతులలో నున్నదామె!

నార : పోనీ యటులే యనుకొందము. కానీ సౌబలా! సర్వ లక్షణ లక్షితుడైన రారాజును - మీాదు మిక్కిలి

సొంత మేనల్లుని చేతులార నాశనము చేయుటకు నీ మనసెట్లు ఒప్పినదయ్యా!

శకు : ఈ కౌరవులు కన్నుగానక నాతండ్రికి చేసిన పరాభవ మును మరువగలనా స్వామీ?

నార : తిన్నయింటి వాసములే లెక్కింతువా?

శకు : వేరు మార్గములేదు సురమునీ! అరచేతిలో అపరంజి రేఖ – పాదములో పద్మరేఖ కలిగి–అదృష్టదశ విద్య లలో ఆరితేరి – అనిలానల జలస్థంభనాది యోగ సిద్ధులు వడసి – శివనిష్ఠాగరిష్ఠాత్ముడై – గ్రీష్మాదిత్య పటు ప్రతాప ప్రభావిభాసుండైన మానధనుడగు సుయోధనుని మాటలతో వంచించి మడిగించవలయును గాని శత్రువులమై జయింపలేము.

నార : అవునులే! మనము కొట్టలేనిచో బలవంతునిచే గొట్టింపవలయును. మరివ్యూహము పన్నితివా?

శకు : మానవులు ఆత్మస్తుతివలన సగమును పరనిందవలన సగమును చత్తురు. ఆ రెండింటిచేతనే దుర్యోధనుడు నాశనము కాగలడు.

నార : చక్కటి శాంతి ఆయుధమునే కనుగొంటివి.

శకు : మీతండ్రి నా నొసటను వ్రాసినవ్రాత.

నార : నిజమున కిందు మనదేమున్నదయ్యా! ధర్మసంస్థాప నార్థమై ఆలీలామానుష విగ్రహుడాడించు నాటక ములో మనము పాత్రధారులము మన పాత్రలను మనము నటించిపోవుదుము. అంతియేకదా!

శకు : అది తెలిసియే యీ దుష్కార్యమున కొడిగట్టితిని.

నార : మొత్తమునకు నీ నేరము పరులనెత్తిని రుద్దు బుద్ధిని పోనిచ్చుకొంటివి కాదుగదా శకుని మంత్రీ !

శకు : నేనేమి చేయుదును ? అది నానొసాటను మీ తండ్రి వ్రాసిన వ్రాత !

నార : సరిసరి! చాలించుము. వారు వచ్చుచున్నారు.

[బట్టలు ఆభరణములు మార్చుకొని లోపలినుంచి దుర్యోధనుడు బయటినుంచి కర్ణ దుశ్శాసనులు వత్తురు]

నార : మఃగ్గురొక్కసారిగనే వచ్చితిరే !

దుశ్శా ; మనసులొక్కటి గావున

కర్ణు ; మార్గములు కూడ!

దుర్యో; ఇక నాలస్యము దేనికి బయలుదేరుదమా !

నార; అవశ్యము! [ముందు నడచును. అందరు అనుసరింతురు. తెర నెమ్మదిగా పడును]

—:o:—

# కౌరవ పాండవీయం

## రెండవ రంగము

[సమయము సాయంకాలము. తెరబయట నారదుడు వీణ మీటుచు పాడుచు వచ్చును.]

నార : రాధతో సరాగమాడే
రాసలీలల మురళీకృష్ణా !
లోకమంతా అశాంతితోడ
ఎలాగున్నదో చూడుమయ్యా ॥రా॥

స్వార్థకాముల అర్థదాహము
హద్దులెంచక మీరిపోగా
నీతిమంతులు సత్యవంతులు
మాడుచుండిరి చూడుమా
రాధతో సరాగమాపి
రాసలీలలు నిలిపి వేగా
కరుణగనుమా దయాంతరంగా
మొరలు వినుమా కృపాంతరంగా ॥రా॥

పదవికోరకై ప్రజనేమాపే
దొంగవారలె దొరలై నారు
మనుజ హంతకులైనవారే
మంత్రులైతిరి చూడుమా

రాధతో సరాగమాపీ
రాసలీలలు నిలపి వేగా
కరుణగనుమా దయాంతరంగా
మొరలు వినుమా కృపాంతరంగా ॥రా॥

[పాట ముగియగానే నారదుడు వెళ్ళిపోవును. అతడు వెళ్ళగానే తెర లేచును. అది మయసభ. అప్పటికే అర్జునుడు ద్రౌపది సభావైభవమును పరికించుచున్నారు]

అర్జు: దేవీ చూచితివా మయసభా వైభవము! మయుని శిల్ప రచనా వైదుష్యము నిరుపమానము!

ద్రౌప: నిజమే ఫల్గుణా! మీమీదగల పుత్రవాత్సల్యముతో దేవేంద్రుడు మయుని పంపి మానవులకు లభ్యముకాని యీ మహాసభను నిర్మింపజేసినాడు. కానిచో భూలోకమున నిట్టిది చూడ దొరకునా ?

అర్జు: భూలోకమునందేగాదు. ముల్లోకములలో నెందును ఇట్టి సభ మరియొకటి లేదు,

ద్రౌప. ఇందున్నవన్నియు లేనట్లుగను లేని వున్నట్లుగను కనబడు నని కదా మయుడు చెప్పినాడు.

అర్జు: అంతేకాదు పాంచాలీ! మరియొక చిత్రముగలదు. ఈ సభలో ప్రవేశించినవారికిగాని ఇందలి కళా సౌందర్యము కనిపించదు. పైనుంచి చూచువారలకు వట్టి గోడలు నేలమాత్ర మగపడును.

ద్రౌప; అర్జునా! ఈ రత్నకంబళి ఎంత బాగున్నది (కాలిడ బోవును).

అర్జు : (చేయిపట్టి లాగి) కాదు కాదు, అది రత్న కంబళి యను భ్రమను కల్పించినాడు.

ద్రౌప : అద్భుతము! ఎంతటి శిల్పరచనా చమత్కారము!

అర్జు : ఇటు రమ్ము. ఇటు చూడుము! ఏమిటది ?

ద్రౌప : జలకూపమువలె కన్పించుచున్నది. అయిన నిది తప్పక రత్నకంబళియే కావలయును.

అర్జు : లెస్సగా గ్రహించితివి. ఇంద్ర నీల హరిత మరకతమణి కిరణ కాంతి పుంజ సమ్మిశ్రమముతో జలమను భ్రమను కల్పించినాడు.

ద్రౌప : మయుని ప్రజ్ఞాసంపత్తి అనిర్వచనీయము.

అర్జు ; చూడుమా ద్వారములు నిజమునకచ్చట కవాటములు లేవు. మనము లోనికి వచ్చిన కవాటము గోడవలె నున్నది. నిజమునకు కుడ్యమగపడు చోటనే ద్వారమున్నది. అటుచూడు! ఆ సాలభంజిక లెంత మనోహరముగా నున్నవో!

ద్రౌప ; అంత అందమున్నచోట ప్రాణము లేదు

అర్జు ; ప్రాణమున్నచోట నంత అందముండదు.

ద్రౌప ; అదియే సృష్టి చిత్రము.

అర్జు : కానీ యీ సాలభంజికలు నవ్వగలవు-పొగడగలవు!

ద్రౌప ; నిజమా పార్థివా? నవ్వింపుడు విందము!

అర్జు : వానిని నవ్వించు మీాట ఆ జలకూపమునందున్నది.

ద్రౌప: జలకూపమునందే యెందుకమర్చినాడు?

అర్జు : రత్నకంబళిగా నగపడు నాజలకూపమునం దెవ్వరైన పొరపాటున కాలిడిపడినచో మీాట కదిలి సాలభంజికలు నవ్వును. ఆ నవ్వులు విన్నవారు వచ్చి పడినవారికి చేయూత నివ్వగలరు మయుని ప్రతిభా విశేషమున కిది యొక నిదర్శనము. ACC NO - 5555

ద్రౌప: సాలభంజికలు పాడునంటిరికదా! వానిని పాడించు కీలక మెందున్నది? OU. 6200

అర్జు : రత్నకంబళి యడుగున. ఇరువురేక కాలమందా రత్నకంబళిపై నిలచినచో దాని క్రిందనున్న మీాట కదిలి సాలభంజికలు పాటపాడును. 8 OU 8132

ద్రౌప: బొమ్మలచే పాడించుట చిత్రమే! NAR

అర్జు : కేవలము పాడుటమాత్రమే కాదు. ఆ సమయములో కంబళిపైనున్న వారి మనసులోని భావములను మాటలుగా మార్చి పాడును: వారే పాడినట్లుండును.

ద్రౌప: అత్యద్భుతము! తప్పక వినవలసినదే!

ద్రౌప : అత్యద్భుతము! తప్పక వినవలసినదే!

అర్జు : ఎప్పుడు ?

ద్రౌప : ఇప్పుడే!

అర్జు : ఇది సమయముకాదు దేవి!

ద్రౌప : ఎందువల్ల?

అర్జు : దేవీ ! మత్స్యయంత్రము గొట్టినప్పుడే నీ మనసు నాకర్పించితివి. నీవు పుట్టినదే నాకొఱకు గదా ! నా మీదగల మరులుతో నీ మనసు విరాళినొందును ప్రణయ సల్లాపమునకిది సమయము కాదు.

ద్రౌప: కారణమేమో!

అర్జు : రాజసూయ దీక్షాబద్ధులమైన మనము అవభృథస్నానమగునంతవరకు మానసికముగానైన శృంగార వాంఛలనుభవింపరాదు. నియమభంగమైనచో మనకు పడరాని యిడుములు కలుగునని వ్యాసమహర్షి సెలవిచ్చెను కదా!

ద్రౌప: కారణమున్నచో కర్మననుభవింపక తప్పదు. జరుగనున్నది జరుగక మానదు. ఈ అందములు చూచుట చేతనో మరెందుచేతనో నాహృదయము రాగరంజితమగుచున్నది. మనసులోని మధురభావములు. మరుమల్లియల మంజుల పరిమళమ్ములను వెదజల్లుచున్నవి. ప్రియా! నాకోరిక మన్నింపుడు.

అర్జు : అవిపాడినచో మనకు తెలియకుండగనే అందుల కనుగుణముగా మన మభినయింతుము.

ద్రౌప: కానిండు! నేను పాట వినవలసినదే!

అర్జు : సరియే! నీయిష్టము.

(ఇద్దరు రత్నకంబళిపై నిలిచిన వెంటనే పాట ప్రారంభమగును. అది యుగళగీతము. పల్లవి ముగిసి చరణము ప్రారంభము కాగానే ఇరువురు పెదవి కదపకుండ భావానుగుణముగా అభినయింతురు)

స్త్రీ : అందాలు కనుగొంటివా ?
ప్రియా! ఆనందమును గంటివా ||అం||

పు : అందాలు కనుగొంటినే
ప్రియా! ఆనందమును గంటినే ||అం||

స్త్రీ : పగలే నెలరాజు పండు వెన్నెలగాసె
వగవే వలరాజు గుండెనమ్ముగ దూసె
మగరాయడా యింత
బిగువేల నా చెంత ||అం||

పు : హృదిలో నులివేడి మురులు పొంగులువార
మదిలో వెనుకాడి తరుణి సంగతి దూర
సుదతీ మణీ సుంత
అదురాయెనా చింత ||అం||

స్త్రీ : వలపే చెల రేగి చెలిమి పూవులు పూయ
పు : తలపే తులతూగి కలిమికాయలు కాయ
స్త్రీ : హొయలే మురిపించి మదిని గాలము వేయ
పు : వయసే మరపించి మెదను మాలిమిచేయ
స్త్రీ : పలుకులు వేయేల
చలమేల నన్నేల
పు : అలుకేల జవరాల
గెలిచితివే బాల
ద్దరు: అందాలు కనుగొంటిమా||

(అప్పటికి ద్రౌపది కంబళిపైనుండి తప్పుకొని దూరముగానుండును అర్జును డామె దగ్గరకువెళ్ళి ఆలింగన మొనరించును. పాట ఆగిపోవును).

ద్రౌప: కంబళిపైనుంచి తొలగగానే పాట ఆగిపోయినదే!

అర్జు: అవునా. ఆ కీలకమట్లే పనిచేయును.

ద్రౌప: పాండవ మధ్యమా! ఈ వేళ నా మనసెందుకో రాగ రక్తమై తపించుచున్నది. మనసు మరులతో మరుగు చున్నది.

అర్జు: దేవీ! నీమూలముగా మనకు వ్రత భంగమైనది. సర్వ ధర్మములు, సమస్త న్యాయములు తెలిసిన నీవే యిట్లు మోహ వివశయగుట విధి వైపరీత్య మనుకొందును. ఎట్టి యిక్కట్లు సంప్రాప్తమగునో యని నా మనసు కలవరపడుచున్నది. అదిగో! ఎవరో ఇటు వచ్చు చున్నారు.

ద్రౌప: ఇంకెవరు ! మీ అన్న భీమసేనుడు!

భీము: (లోపలనుంచి వచ్చి) దేవీ! నీకొరకు ఋత్విజులు వేచి యున్నారు. తమ్ముడా అర్జునా ! సామంతరాజులు తెచ్చిన కప్పములు గణించుటకు అగ్రజుడు నిన్ను రమ్మనినాడు.

అర్జు: మంచిది అన్నా! కర్ణ శకుని దుశ్శాసనులకు మయ సభ చూపించుట జరిగినది. దుర్యోధనుడు సువర్ణ దానము చేయుటలో నిమగ్నుడై తీరికలేక ఇంకను మయసభ చూడలేదు. అతడు రాగానే మయసభ చూపించవలయును.

భీము: నే నుంటినికదా! నీవు వెళ్ళుము.

అర్జు: ఈ సభారహస్యము లన్నియు ముందుగా నతనికి వివరింపుము, లేనిచో నతడు తబ్బిబ్బుపడి నగుబాటు పాలగును. మానధనుడైన సుయోధనుడు అవమానము పొందినచో అనర్ధము తెచ్చును.

భీము: నా గదాదండము బెండువో లేదు తమ్ముడూ!

అర్జు: మనము కోరునది చెలిమి కానీ కలహము కాదు.

భీము; నా యభిలాషకూడ నదియే. కాని తొల్లిటివలె వారి దోసములు సైచుట మాత్రము జరుగదు.

ద్రౌప: దుర్యోధనుని పేరు విన్నంతనే ఆగ్రహోద్యుక్తచిత్తులగుచున్నారే! అత డెదురుపడిన ఏమగుదురో!

భీము; నీకా భయమక్కరలేదు దేవీ! బాల్యదోషములు, గడచి బయటపడితిమి. అంధరాజు అర్ధరాజ్య మిచ్చి ఆదరించినాడు. అందుకు కృతజ్ఞతగా నతని కొడుకులు చేసిన అపరాధములన్నియు మరచిపోయితిమి. మీరు వెళ్ళవచ్చును. కురురాజునకు మయసభను నేను చూపింతును.

అర్జు: మంచిది [లోనికి వెళ్ళిపోవును]

ద్రౌప; వాయునందనా! ఇందలి వింతలు విశేషములన్నియు మీకు పూర్తిగా తెలియునా!

భీము: ఆహా! సంపూర్ణముగా తెలియును.

ద్రౌప: అయిన నిక చెప్పుట దేనికి ? నేను పోవుదును.

భీము: ద్వారము చూచి నడువుము. లేనిచో ముక్కు పగులును.

ద్రౌప: ఆ సంగతి మీరే జ్ఞాపకముంచుకొనవలయును. మీకు కోపము ముక్కుపై నుండును.

భీము : అందుల కిప్పుడు అవసరము లేదు.

ద్రౌప; ఏమో! మీ మనసు పట్టి తాటియాకుల మంట!

భీము ; అంతేనా దేవీ!

ద్రౌప: [నవ్వి] వలపు మల్లియలు పంటకాడ !

భీము : [గలగలమని గట్టిగా నవ్వును]

ద్రౌప; [కిలకిలనవ్వి చెక్కిలిపై మీటి లోనికి వెళ్లును]

భీము ; [మరల గట్టిగా నవ్వును. నవ్వుకొనుచు మయసభలో తిరుగుచుండును. గద భుజమున వైచుకొని సాలభంజికల ముందునిలిచి మీసము దువ్వుకొనుచు మురియుచుండును]

శ్రీకృ; (బయటినుంచివచ్చి) ఆహా! ఎంత అందము !

భీము ; ( చూచి) ఓహో! గోపాలుడా ! రావోయిగోపాలా!

శ్రీకృ; జవరాలా! నీ వెవరు బాలా ?

భీము; [విస్మయముతో చుట్టునుచూచి] బావా! ఇక్కడెవ్వతును స్త్రీలు లేరే! ఎవరిని బావా?

శ్రీకృ; బావా! ఎంత తీయగా పిలిచితివే బాలామణీ ! కానీ నిన్నింతకు ముందు చూచిన గుర్తులేదు. ఏ అత్త కూతురవు ముద్దరాలా ?

భీము : [తనను చూచుకొని కంగారుపడుచూ] మాధవా! నీ పరిహాసమింక చాలు. నేను భీమసేనుడను.

శ్రీకృ: చెవులను మోసగించగలవుగానీ కనులను కాదన గలవా వయారీ? మన్మధ బాణమువంటి నీ లావణ్య మెక్కడ— ఎనుబోతువంటి ఆ భీముడెక్కడ?

భీము: కృష్ణా! నాయావేశమును రగిలించవద్దు.

శ్రీకృ: ప్రణయకోపము మధుర తాపముగా మారును లే!

భీము: అయ్యో స్వామీ! నేను భీమసేనుడనయ్యా!

శ్రీకృ: నేను నమ్మనే విరికొమ్మా! వగలు చాలించవే ముద్దుగుమ్మా!

భీము : (చిరాకుగా) విరికొమ్మ! ముద్దుగుమ్మ! నీకన్నులకు నేను ఆడుదానివలె కనిపించుచుంటినయ్యా! స్త్రీలో లత్వము హెచ్చుపెరిగి నీ కన్నులకు రాయిరప్పలుకూడ రంభా తిలోత్తములుగా గనపడుచున్నవా? ఇంతలావు మీసమైనను కనబడుట లేదయ్యా!

శ్రీకృ: మీసమా ఏది? ముక్కునకున్న ముక్కెర ముచ్చ టగా ముద్దుగా నున్నది కదే మోహనాంగీ?

భీము: (తడిమిచూచుకొని) పోనీ నా కంఠధ్వని!

శ్రీకృ:కోయిల పంచమ స్వరమువలె నెంత మధురముగా నున్నది?

భీము: (కంగారుగా) ఈ గదా దండమైనను కనబడుచున్నదా?

శ్రీకృ: (నవ్వి) ఎవరిని మోసగింతువే వగలాడీ? పూల చెండును పట్టుకొని గదాదండమందు వేలనే పూబోడీ!

భీము : (మరింత కంగారుపడి) కృష్ణా! మతిపోగొట్టు చుంటివి. మతి భ్రమణము నీకా నాకా!

శ్రీకృ: నీ యందము చూచి నాకే మతిభ్రమణము కలుగు చున్నది.

భీము : కృష్ణా! కృష్ణా! నాతల తిరిగిపోవుచున్నది. దగ్గరగా వత్తును చూడుమా. (కంగారుగా వెళ్ళబోయి జలకూప మున బడును. సాలభంజికలు కిలకిల నవ్వును)

శ్రీకృ: నీ నవ్వులు మధురాతి మధురము కదా కలకంఠీ!

భీము : కలకంఠిని కాదయ్యా మహానుభావా - మొలబంటి జలకూపమున జిక్కిన భీమసేనుడను. నవ్వినది నేను కాదు-సాలభంజికలు! [తొందరగా రాబోయి గోడకు తలకొట్టుకొని] అబ్బా! శిరోఘాతమైనదే.

శ్రీకృ: ఏమైనది? కుసుమ శరాఘాతమా?

భీము: అబ్బబ్బా! ఊరుకోవయ్యా నారీ సంహారా! నాయంతటి మగవాడిని పట్టుకొని జవరాలా, విరిబాలా అని పిలువ నీకు నోరెట్లు వచ్చినదయ్యా! (దగ్గరకు వచ్చి) నీకన్ను లకు నేనాడుదానివలె నున్నానటయ్యా?

శ్రీకృ: నిజముగా నీవేనటయ్యా! భీమసేనా!

భీము ; నయమే! ఇప్పటికైనా గుర్తించితివి! ఇంతసేపు నన్నాడుదానిని చేసి యాడించితివే!

శ్రీకృ ; ఎవరెప్పుడేమగుదురో ఎవరికెరుక!

భీము ; కాకుడంగనే నీ కంటికి కాంతవలే కనబడితినా!

శ్రీకృ; నాకంటికెట్లు కనబడినను ప్రమాదము లేదయా! నేను అర్భకుడను. బలవంతుల కంటికి మాత్రము బాలామణిగా కనిపించకుమా ప్రమాదము.

భీము : నాకన్న బలవంతులున్నారా! నేను గజబలుడను!

శ్రీకృ ; ఏమో! సింహబలు లుండవచ్చునుగా!

భీము : ఉన్నను మాకేమి భయము కృష్ణా! సింహబలుడే కాదు సహస్ర సింహబలు లున్నను నీ దయవలన మాకు జయమే కలుగును.

శ్రీకృ : ఇప్పుడేకదా అపజయమందితివి. స్త్రీగా సంబోధించినందులకే ఇంత తొట్రుపడితివే! నిజముగా స్త్రీగా మారవలసి వచ్చినచో నేమగుదువయ్యా!

భీము ; అంతపని మాత్రము చేయకుము నీకు పుణ్యముండును!

శ్రీకృ : నేనేమి చేయగలనయ్యా!

భీము ; గండశిలనే నిండు జవ్వనిగా మార్చినవాడవు-గుండెగల నన్ను మార్చలేకుందునా! అదియటుండనిమ్ము. నీ కంటికి నిజముగా స్త్రీ వలె కనబడితినా?

శ్రీకృ ; [నవ్వుచూ] లేదనుకో!

భీము ; మరి వగలాడీ పూబోడీయని నన్నేల హడలగొట్టితివి!

శ్రీకృ ; మయసభలో నన్నియు ఉన్నవి లేనట్లుగను - లేనివి ఉన్నట్లుగను కనపడునటగదా! అటులే స్త్రీ పురుషులు

తారుమారుగా కనబడుదురేమోనని భావించి యట్లుం టిని.

భీము : మంచిపని చేసితివయ్యా మాధవా! ఆతొందరలో జల కూపమునబడి బట్టలు తడుపుకొంటిని. దుర్యోధనుడు వచ్చు వేళకూడ నైనది.

శ్రీకృ : దుర్యోధనుడు వచ్చుటకు నీ బట్టలు తడియుగుటకు సంబంధ మేమిటయ్యా వృకోదరా!

భీము : అది కాదయ్యా మహానుభావా! ధుర్యోధనుడు సువర్ణాగారమున బంగారపు-టిటుకలు పంచిపెట్టుచు తీరిక లేక ఇంతవరకు మయసభ చూడలేదు, సువర్ణ దానము ముగిసినది. అపడిప్పుడిందు రాగలడు. దగ్గ రుండి మయసభా రహస్యములన్నియు సుయోధనునకు జూపించవలయును. అతని కొరకే వేచియుంటిని ఇంతలో నీవు వచ్చితివి. నన్నల్లరిపెట్టి నాబట్టలు తడిపి తివి. తడిబట్ట లసహ్యాముగా నున్నవి.

శ్రీకృ : తడిబట్టలతో నతని ముందు చిన్నతనమేల పొందె దవు? నీవుపోయి బట్టలు మార్చుకొ నుము. దుర్యోధను నకు మయసభను నేను చూపింతును లెమ్ము.

భీము ; నకుల సహదేవులను బంపుదును.

శ్రీకృ : అక్కరలేదయ్యా! మా ఇలవేలుపువైన లన్ని కార్య మున కెట్లు నియోగింపగలను!

శ్రీకృ: మనము మేనత్త బిడ్డలమే కదయ్యా! మీకెల్లప్పుడును నేను అధీనుడనే.

భీము : మాయామానుష విగ్రహా! ఆ దయార్ద్రవీక్షణమే సదా మా యందు బరపుచుండుమయ్యా గోపాలా.

శ్రీకృ: మాటల కేమిగాని తొందరగా పొమ్ము. సుయోధనుడు వచ్చినచో నవ్వుల పాలగుదువు.

భీము ; నిజమే బావా! [వెళ్ళిపోవును]

శ్రీకృ: అంతరాయము తొలగినది. ఇంక అంకురార్పణ జరుగవలె! ఆభారము నాప్రియతముడైన శకునిదే.

శకు : [వచ్చుచు నమస్కరించి] శ్రీకృష్ణా! యదుభూషణా! రాధికావల్లభా! ప్రణామములు-ప్రణామములు.

శ్రీకృ; ఆదరముగా చేతులుచాచి పట్టుకొని సౌబలా! ఇష్టమనోభీష్ట సిద్ధిరస్తు.

శకు : నాయభీష్టము నీకు తెలియనిదా కృష్ణా!

శ్రీకృ: తెలిసియే దీవించితి ననుకొనరాదా!

శకు ; అయిన నాకిది హెచ్చరికా స్వామీ!

శ్రీకృ; హెచ్చరికలు లేక మచ్చరికము పెరుగుటెట్లు!

శకు ; అక్కరలేదు మహాత్మా.

శ్రీకృ; అందులకేనా మీ తండ్రి కిచ్చిన మాట మరచి కయ్యము మాని వియ్యము వలె నెయ్యముగా విందు లారగించుచుంటివి!

శకు ; ఇచ్చట నేను తినచున్నది విందుకాదు విషము. ఆ విషపునోటితోనే కురువంశ వృక్షమును కాటువైచి సమూలముగా నిర్మూలింతును

శ్రీకృ; అది రుజువు కావలె!

శకు ; కాలము కలసి రావలె!

శ్రీకృ; ఇంతకన్నా మంచి కాలమెప్పుడు వచ్చునయ్యా!

శకు : అదియే నేనును ఆలోచించు చుంటిని.

శ్రీకృ; అదను దాటినచో ఆశాభంగ మగును. పదునుచూచి బీజము వేయవలె! సుయోధనుడు మానధనుడు.

శకు : అవును.

శ్రీకృ; అతని యభిమానమున కాఘాతము కలిగినచో!

శకు ; మంటలు మండును.

శ్రీకృ; అదియే యిప్పుడు జరుగవలసినది.

శకు : అర్థమైనది స్వామీ!

శ్రీకృ; దుర్యోధనుడు రావచ్చును. రమ్ము మనము పోదము.

శకు : మంచిది కృష్ణా! [ఇరువురు లోని కరుగుదురు]

దుర్యో: బయటనుంచివచ్చి సభలో ప్రవేశించి విస్మయానందములతో| ఆహా! ఎంత చక్కటి శిల్పరచనా విధానము! విశ్వకర్మ నిర్మితమైన యీ యింద్రప్రస్థ నగరమే యొక వింతగనుండ - భావిపురాతనాద్యతన శిల్పకళా సృష్టి నధఃకరించు నీ మయసభ వింతలకెల్ల వింతగ నున్నదే! (ముందుకునడిచి సంభ్రమముతో)

నవనోన్మేష పరిస్ఫుట యౌవన ప్రాదుర్భాసిత జగదేక మోహనోద్ధత సుకుమార లావణ్య సీమలగు నీ భామలు—ఏల కదలక కనురెప్ప వేయక వన్నే చూచుచున్నారు! కెంపులు విరియు సొంపుల చెక్కిళ్ళపై కొనగోట మీటి సిగ్గులు చిందింతునా! [మీటి-అచ్చెరువుతో] ఔరా! ఎంత భ్రాంతికి లోనైతిని. ఇవి సాలభంజికలు! సృష్టికి ప్రతి సృష్టి యొనరించిన ఓ మయబ్రహ్మా! నీ నామమును సార్థక మొనరించుకొంటివోయి, వెన్నెల ముద్దలు వంటి లావణ్య ముగ్ధల్లారా! మీకు మాటలుకూడ వచ్చునా? మీరు నవ్వగలరా! మీకు నవ్వుటకూడ చేతనైనచో మయుడు చతుర్ముఖునే మించిపోవునే! మీ నవ్వుల పన్నీటిజల్లులలో ముల్లోకములు మూర్చిల్లునే! మీ యంతటి అందగత్తెలు ఎంత సుందరముగా నవ్వుదురోకదా! ఏదీ నవ్వుడు! ఒక్క చిరునవ్వు! బాలభాస్కర కరస్పర్శకు పులకించి సిగ్గుతో అలవోకగా నవ్వు శతపత్రకన్యలవలె యేదీ ఒక్క చిరునవ్వు!.... నవ్వరా?.... అవునులే! మీరు మృతప్రాయులు కదా! మిమ్ములను నవ్వించు నుపాయమున్న నెంత బాగుండును! అప్పుడు విరామము లేకుండ మిమ్ములను నవ్వించి నవ్వించి మువ్వంపు జవ్వనమును కవ్వించి కవ్వించి నవ్వుకొందును.

[ముందుకు నడిచి] ఈ కూపమునందలి జలమెంత
స్వచ్ఛముగానున్నది! సంస్పరించినచో మరెంత ఆహ్లాద
కరముగా నుండునో! [కూర్చుని దోసిలియొగ్గి నీరు
తీయబోవును. అందులో నీరు లేదు. విభ్రాంతితో]
ఏమిటిది, జలాశయము కాదా యిది! హరినీల పద్మ
రాగ వజ్రవైడూర్య మరకత మాణిక్య కెంపు గోమేధ
పుష్యరాగ కాంతి కిరణ సంయుక్త పరావర్తనముతో
మయుడు కల్పించిన కృత్రిమ భ్రాంతి జలాశయమా
యిది! (లేచి) లేకున్న సభామధ్యమున జలాశయ
మేమి! చూచితిరా సాలభంజికలారా! ఎంత మనో
హర సౌందర్యమున్నను మనసులేని మీ అందమువలె
ననే దాహము తీర్చలేని యీ నవరత్న మృగతృష్ణ
కూడ వ్యర్థమే! ఇదంతయును మృతసౌందర్యము -
కేవలము మృతసౌందర్యము! [మరొక ప్రక్కకునడిచి]
నవరత్న ఖచితమగు నీ రత్నకంబళి నామనసు నాక
ర్షించుచున్నది. ఇందలి రంగవల్లికల రంగులు ఎంత
ముచ్చటగానున్నవి! విరామకాలమున వినోదమునకై
పట్టమహిషితో చదరంగ మాడుకొనుటకు వినియో
గింపవలసిన ఈ రత్నకంబళిని సభామండపము నందుంచి
రేలనో! అవునులే! ముక్కు మూసికొని జపము చేసి
కొను ధర్మరాజునకు అంతఃపురాలంకరణ లెట్లు తెలి
యును! ఏమైనను ఈ రత్నకంబళి యపురూపలావ

ణ్యము నన్ను ముగ్ధుని చేయుచున్నది. ఇందుపై కొంత తడవు విశ్రమించిన నెట్లుండునో! (కంబళిపై కాలు పెట్టును. అది కంబళి కాదు, నీరు. నీటిలో పడును. వెంటనే కిల కిలమని నవ్వులు వినిపించును.) [లేచి నలువైపుల చూచి] ఎవరా నవ్వినది? మాట్లాడ రేమి? ఎవరా నవ్వినది? (నిదానించి) ఓహో! మీరా సాలభంజికలారా! మీకు నవ్వుడకూడ చేతనగునన్న మాట! వీణా నిక్వాణము వలే మీ నవ్వులెంత మనోజ్ఞముగా నున్నవి!

శకు : [లోపలనుంచివచ్చి] నాయనా సుయోధనా! చూచితివా యీ అందాల సభను?

దుర్యో : చూచితిని మామా చూచితిని. నీవు కూడ చూడుము. అన్నిటికన్న అద్భుతము సాలభంజికల నవ్వులు!

శకు : (వెటకారముగా నవ్వి) సాలభంజికల నవ్వులా?

దుర్యో : ఇప్పుడే నవ్వినవి! నీవు వినలేదా?

శకు ; [చేయి నందించి పైకి తీయుచు] వింటిని. కాని యవి సాలభంజికల నవ్వులను కొంటివా?

దుర్యో : కాదా మరి?

శకు : ఎంత అమాయకుడవోయి అల్లుడా! పరిబన పతివ్రతయైన ద్రౌపది నిన్ను చూచి నవ్విన నవ్వులను సాల భంజికల నవ్వులని సంతసించు చుంటివా?

దుర్యో : ద్రౌపది నన్నుచూచి నవ్వుటయా? ఎందులకు ?

శకు : అంధునివలె గోతిలోపడిన నిన్ను నవ్వులపాలు చేయుటకు, స్త్రీజన సమక్షమున నీకు నగుబాటు కలిగించుటకు, నిన్ను అవమానించి ఆనందించుటకు.

దుర్యో . [కోపముతో] మామా! పరిహాసమా?

శకు . పరిహాసము కాదు. ద్రౌపదికి నీవన్న అసహ్యము.

దుర్యో: [బాధగా] మామా! నామనసు వికలమగుచున్నది.

శకు : నాకెప్పుడో యైనది, చీకటి కొట్లలో మట్టిక్షటుకలు పెట్టి అవి బంగరుటిటికలని నీతో చెప్పి దానమిప్పించిరి. రేఖాస్పర్శతో నవి నిజముగా బంగారమైనవి. దానముచేసిన ఘనత పాండవులది-వెట్టిచాకిరీ నీయది!

దుర్యో : (కోపావేశముతో) వంచన! నయవంచన!

శకు : దానిని మించినది.

దుర్యో: ఏమిటది?

శకు : మయసభా రహస్యము లందరకు ముందుగా చెప్పిచూడ బంపుచుండిరి, నీకు మాత్రము చెప్పరైరి. సార్వభౌముడవైన నీకు చెంతనుండి చూపింప చివరకొక పరిచారకునైన నియమింపరైరి. ఎందులకు ? నిన్ను గోతిలో పడవేయుటకు, పడిన నిన్నుచూచి పరిహసించుటకు. దాసీదాసుల యింట ఆడుదానిచే పరిహాసింపబడెనని సామంతులు నిన్ను చులకనగా చూచుటకు.

దుర్యో: [బాధతో విలపిల్లుచు] మామా! యీ యవమాన పరితాపాగ్ని నా యొడలెల్ల దహించుచున్నది. ఇంతటి పరాభవమును సహించి బ్రతుకుటకన్నా ప్రాణత్యాగ మొనరించుట మంచిది.

శకు : రాజ రాజా! ఆమాటననకుము. దాయాదులు విన్న మరింతలోకువ యగుదువు. ఆ దుర్జాతి లజ్జావిహీనమై నవ్వినంత మాత్రమున చక్రవర్తి ప్రాణత్యాగ మొన రించుకోవలయునా! పరాభవమునకు ప్రతీకార మొన ర్చుటయే పురుషుల లక్షణముగాని పిరికి మానిసివోలె దుర్మరణము పాలగుట వీరోచితము కానేరదు. పరాభ వాగ్ని చల్లారుటకు ప్రతీకార శరపాతమే పరమ సాధ నము. [దగ్గరగా వెళ్ళి] మానధనా సుయోధనా! యీ మయసభ నీదికావలె. ఆ బంధకి పాంచాలి నీ యింట దాసికావలె! ఆ పంచభర్తృకను పదుగురు మగవారి యెదుట పరాభవించి నీకసితీర నవ్వుకోవలె! అదికాదా మగతనము!

దుర్యో : నిక్కము మామా చక్కగా జెప్పితివి. రమ్ము. వెంటనేపోయి సర్వ బలములు సమాయత్తముచేసి దండెత్తి పాండవులను కొండలకు తరుముదము.

శకు : అది వీలుపడునా సుయోధనా?

దుర్యో : మామా! నాబలమునే శంకించుచుంటివా! భీష్మ ద్రోణ కృపాశ్వత్థామాద అతిరథ మహారథ సమున్న

తేకాదశీ అక్షౌహిణీచమూ సమూహంబుల కధి
నాథుండనై - బాలార్క ప్రభావిరాజితుడై శాత్రవ
తాపన ప్రళయాగ్ని భీకరుండైన రాధేయున కారవ
ప్రాణమునై - వీరాధివీర శతసోదరాగ్రజుడనై గదా
యుద్ధమున బలరాముని మెప్పించిన ధైర్యస్థయిర్య బల
పరాక్రమ సంపన్నుడనై - నవఖండ భూమండలాధిప
సువర్ణ! మకుట తటస్థగిత పద్మ రాదోజ్యలత్ప్ర కటా
నర్గళ తిక్కరణ రేఖా ప్రతిఫలిత పాదారుణ పంకేరు
హుండనైన నేను ఒక్క యూడుది చేసిన పరాభవము
నకు బదులు చేయలేక పోవుటయా!

శకు : నా యభిప్రాయమది కాదు. మీ తండ్రి యుద్ధమున
కంగీకరించడు. నీవు స్వతంత్రుడవు కావు,

దుర్యో : అయిన నేదో మార్గము నీవే యాలోచింపుము.
పాండవ విభజనా విధానంబును పాండవ పట్టమహిషీ
పరాభవమ్మును చేయుసులభోపాయ మాలోచింపుము.
[తొందరగా వెళ్ళబోయి గోడకు తలకొట్టుకొని]
అబ్బా! యీ మాయాకవాటము నా తలగొట్టినదే!

శకు : నీతల గొట్టవలయునని యే పాండవుల పట్టుదల. కాని
మానధనుడైనవాడు ఆత్మహానియు సవత్నులవృద్ధియు
సహింపడని వారెరుగరు.

దుర్యో: ముమ్మాటికీ సహింపరానిదే! మామా! ఇక నాలోచన
మక్కరలేదు. పాండవులను సర్వనాశన మొనరించు

మార్గమాలోచింపుము. ఇక్కడొక్కక్షణమైన నిలువ లేను. [వేగముగా పోబోయి చటుక్కున ఆగి నెమ్మదిగా ద్వారము వెనుకకొని బయటకు వెళ్ళిపోవును]

శకు : [నిట్టూర్చి] కారణము కలిగినది. ఇక రణమే మిగిలినది. అందులకు నాంది పలుకు నుపాయము ? [ఆలోచించుచుండును]

నార ; [వచ్చి] సౌబలా! ఏమంత దీర్ఘముగా నాలోచించుచుంటివి! పాచికలపైకి మనసు మళ్ళినదా యేమి!

శకు : [సంతోషముతో] ఆహా ! సమయమునకు చక్కగా జ్ఞాపకము చేసితిరి. మునీంద్రా! ధన్యవాదములు.

నార : ఏమిటది శకుని మంత్రీ !

శకు ; పాచికలు-పాచికలు !

నార ; సరిసరి! పాచికలతో నేమిచేయుదవయ్యా !

శకు : మునీంద్రా [పాచికలు] యివి మా తండ్రి ఎముకలతో చేయబడినవి. మాతండ్రి నాకిచ్చిన వరము ప్రకారము నేనెట్లుకోరిన అట్లే పడునవి. ఒక పందెము వేసి పరీక్షింతురా! [ఆశించును]

నార : వద్దు! వద్దు! నావంటివారిని చెడగొట్టకుము.

శకు ; చెడిపోవుటకు మీ చేత నేమున్నది? వీణయేకదా?

నార : చెడిపోవుటకు చేతిలోనే యుండవలయునా !

శకు : సరియే మునీంద్రా ! నేను తోందరగాపోయి రారాజు

ననుసరింపవలయును సెలవా మరి. శ్రీకృష్ణభగవాను నకు నావందనములు చెప్పుదురుకదా! [వెళ్ళిపోవును]

నార : మంచిది. [అతడు వెళ్ళినతర్వాత] రాజకీయపు మేజు వాణీలు-అధికార జూదములు ఇక్కడ జరిగినట్లుగా మరెక్కడను జరుగవేమో! ద్వాపరమునందే యిట్లున్న నిక కలియుగమున మంత్రులు మరెంత దారుణముగా వర్తింతురో? మారణ హోమము కోరువారు మంత్రు లైనచో నిక మానవజాతికి మనుగడ యెక్కడిది?

ధర్మ : [లోపలనుండివచ్చి] ఏమి మునీంద్రా మీరొంటరిగా నుంటిరి?

నార : ఈ సభను విడిచిపోవ బుద్ధిపుట్టుట లేదయ్యా ధర్మ రాజా! సర్వసంగ పరిత్యాగినైన నాకే యింత మమత గొలుపుచున్న ఈ మయసభ భోగలాలసులైన మీ బోటులకు మరులు కలిగింపకుండునా? అనన్యలభ్యమగు మయసభ లభించినది. అర్ధరాజ్యము వచ్చినది. ఇక చీకు చింతయు లేక హాయిగా జూదమాడుకొనుచు కాలక్షేపము చేయుము.

ధర్మ : స్వామీ! అవ్యసనమునకు దాసుడనై నందులకే సిగ్గు పడుచుంటిని. మీ వంటి వారింకను చెప్పుట భావ్యమా?

నార : హరిహరి, నాకాతలంపు లేదయ్యా. అష్టకష్టములు పడి లక్కగృహమునుండి తప్పించుకొని వివాహమాడి

రాజ్యమును సంపాదించితిరి కదా. ఇకనైన సుఖపడు మని - నీకు అక్షవిద్యయందు మమకారము ప్రావీణ్యము కలదుకదాయని యట్లంటినిగాని నిన్ను సిగ్గిల చేయుటకు కాదయ్యా. అయిన నిందు సిగ్గుపడుట కేమున్నది! జూదము రాజులకు నేరము కాదుకదా!

ధర్మ : శాస్త్రమట్లే చెప్పుచున్నది యుద్ధమునకు జూదమునకు సాటివారు పిలిచినచో వెనుకాడుట రాచపాడి కాదు. జూదమునందలి జయాపజయములు యుద్ధమునందలి జయాపజయములవంటివే యని శాస్త్ర నిర్ణయము.

నార : యుధిష్ఠిరా! నీకు తెలియని శాస్త్రమేమున్నదయ్యా!

ధర్మ ; అంతయు మీ యాశీర్వాదము శ్రీకృష్ణుని యనుగ్రహము అది సరి! దుర్యోధనుడింకను రాలేదా మునీంద్రా !

నార ; ఇంకెక్కడి దుర్యోధనుడయ్యా! అలిగిపోయినాడు.

ధర్మ ; అలిగినాడా? ఎందులకు? కారణమేమి స్వామీ!

నార : గిల్లి కయ్యములాడువారికి కారణమే కావలయునా! యతనికై యనవసరముగ నాలోచింపక శ్రీకృష్ణుని యనుగ్రహమునకు పాటుపడుము. రమ్ము కృష్ణుని చెంత కేగుదము.

ధర్మ ; పదండి స్వామీ!

[ఇద్దరు బయటకు వెళ్ళుచుండగా తెరపడును]

# కౌరవ పాండవీయం

## మూడవ రంగము

[తెరబయట నారదుడు పాడుకొనుచు వచ్చును]

నారద : ఏమని పాడుదురా జగన్నాథ
నీ మాయాన్విత మధురగాథ ॥ఏ॥

హృదయంలేని శిల నవ్విందా ?
మదగర్వాంధుని యెద కవ్విందా ?
నవ్వులాటల నగుబాటులేలా ?
పువ్వులలో నగ్నిరవ్వల వేలా ? ॥ఏ॥

పగలే రేగి పంతముసాగ
జగమేభోగి మంటలు కాగ
మారణహోమం నీకేలా
కారణమీవై కావేలా ?
కౌరవులెవరు పాండవులెవరు ?
వారికి వారికి ఎందుకుపోరు ?
పాపమెరుగని నాకిదియేలా ?
ఈ పని నాతల కిడనేలా ?

[పాట ముగియగానే నారదుడు వెళ్ళిపోవును. వెంటనే తెరలేచును. రంగస్థలమున కడ్డముగా నెర్రని పట్టుదట్టి (రిబ్బన్) కట్టబడి యుండును. లోపల తగినన్ని పీఠములమర్చబడి యుండును. మధ్య నగారిసవ ముందును. ఒక ప్రక్కన రత్నకంబళి పరచియుండును. పట్టుదట్టికి వెలుపల

ఒక వరిక్కనుంచి ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నారదుడు వచ్చు చుండగా ఎదుటివైపునుంచి దుర్యోధనుడు, కర్ణుడు, శకుని, దుశ్శాసనుడు, అశ్వత్థామ వత్తురు. దుశ్శాసనుని చేతిలో బంగారుపళ్ళెరము అందులో నొక పూలమాల - బంగారు కత్తెర యుండును.]

దుర్యో: [ధర్మరాజున కెదురుగా వచ్చుచు-ఆప్యాయముగా] స్వాగతము; పాండవాగ్రజునకు సుస్వాగతము. (రెండు చేతులు పట్టుకొని) అన్నా! ధర్మరాజా! మా ఆహ్వానము మన్నించి ఆదరముతో అరుదెంచి మా యీ నూతన క్రీడామందిరమునకు ప్రారంభోత్సవము జరుప నంగీకరించినందులకు అభివందనము లర్పించుచున్నాము [పూలమాల అతని కంఠమున వేయును. అందరును కరతాళ ధ్వనులు చేయుదురు.]

నార : దండలు మెడలో వేసి కొండలవంటి కోరికల దండకము చదువుటాచారము కదా. అటువంటి విజ్ఞాపన లేమైనా నున్నవా?

శకు : అటువంటి దేమియును లేదు మునీంద్రా: మనలో మనకు విజ్ఞాపనలు విసతిపత్రము లెందుకు. భవనము నూతనము గావున ధర్మరాజు లాంఛనముగా ప్రవేశ ప్రారంభోత్సవము జరుపును.

దుర్యో: అన్నా! యీబంగరు కత్తెరతో ఈ పట్టుదట్టిని కత్తిరించి ముందు నీ పాదమును లోనబెట్టి ప్రారంభము చేయుము. [కత్తెరనందించును.]

ధర్మ : [పట్టుదట్టిని కత్తిరించును. అందరును కరతాళధ్వనులు చేయుదురు. కత్తెరను పళ్ళెరములో పెట్టి లోనికి నడచును.]

నార : కత్తిరింపులతో నారంభమైనది. ఇక చిత్తగింపులేమి ?

శకు : ఏమున్నది? కేవలము వినోద కాలక్షేపము. ఇది కౌరవ సోదరుల వినోద క్రీడామందిరము. ఆహూతులేగాని అన్యులిచ్చటకు రారు. వృద్ధులకు, కులపెద్దలకు నిందు ప్రవేశము లేదు.

దుర్యో ; అన్నా! ధర్మనందనా! అగ్రాసన మలంకరింపుము.

ధర్మ : సంతోషము తమ్ముడా! [కూర్చుండును]

దుర్యో: అందరును ఆసీనులు కండు. [అందరును కూర్చున్న వెనుక] అర్జునా? నకుల సహదేవులేరి? వారు రాలేదా?

అర్జు : వచ్చిరి. ద్రౌపదితో కలసి గాంధారీ మాతృదేవిని చూడనేగిరి. తొందరలో నిటువత్తురు.

ధర్మ: తమ్ముడా సుయోధనా! ఈ నూతన మందిర నిర్మాణము అపురూపముగా సాగినది. ఇందలి శిల్పరచనా విభూతి నిరుపమానము.

నార : నిజమే సుయోధనా ! ఇది మయసభనే తలదన్నుచున్నది. మాయసభ కాదుకదా!

దుర్యో: అటువంటి వేమియు నిందులేవు మునీంద్రా! ఇచ్చటన్నియును ఉన్నవున్నట్లుగనే కనిపించును. కనిపించినవి కనిపించినట్లుగనే యుండును.

నార : ప్రమాదము లేదు. ముక్కు కుసూటిగా బోవచ్చును.

దుర్యో : మామా ! అతిథుల నానందింపజేయుట కేమి ఏర్పాట్లు గావించితిరి?

శకు : ఏది వలసినను సిద్ధమే ! పురాణచర్చ చేయుదుమా !

కర్ణ : పురాణములన్నియు నిస్సారములు. పాడినదే పాటగా నదేయేల ?

శకు : అస్త్రవిద్యా నైపుణ్యము చర్చింతమా !

దుశ్శా : జీవితమంతయు నదేనా మామా ! వినోద మొన గూర్చు నేర్పాట్లు లేవా?

శకు : సంగీత సాహిత్య నృత్యకళా సమన్వితమైన ప్రదర్శనము తిలకింతమా ?

ధర్మ : అంతకు మించిన వినోద మేమున్నది ?

దుర్యో: అన్నకు నచ్చినది అదియే కావింపుడు.

శకు : మంచిది (చప్పట్లు కొట్టును. లోపలనుంచి నర్తకి వచ్చును ) రాజనర్తకి నాట్యమున కుప్రకమింపవచ్చు.

[నర్తకి తనదోసిటనున్న పూలు ధర్మరాజుపై జల్లి నాట్యముగానము ప్రారంభించును. నారదుడు పరవశించినట్లుగా తాళము వేయుచుండును.

నృత్య గీతము ;

మొగమాట మిక నేలరా
బిగికౌగి లీయరా
వగలున్న దాన
నిగనిగ లున్న దాన ॥ మొ॥

వయసే నిగ్గులు దేర! వలపే పొంగులువార
సొగసే వన్నెలుమీర! మనసూ నిన్నే కోర
నా చరణమంజీర నాదమ్ములిను జీర ॥మొ॥

అసలే వెన్నెల వేడి! అటుపై కంతుని దాడి
విరిబాణముల వాడి భరియింపలేనోడి
ఇక నీ మానము వీడి! నన్నేలుటయె పాడి ॥మొ॥

కలనై కన్నులయందు! అలనై గుండెలయందు
మరులై మానసమందు! మమతై విరహామునందు
మధువై అధరమునందు నినువిడక నేమందు ॥మొ॥

[నాట్యము ముగించి నర్తకి దోసిలొగ్గి నిలుచును.]

ధర్మ : భళీ! నర్తకీ ? నీ కవనగాన నాట్యకళా ప్రౌఢిమకు సంతసించితిమి. మా సంతోషమునకు చిహ్నముగా నీ నవరత్న హారమును బహుకరించు చుంటిమి. తీసికొమ్ము. [మెడలోని హారము తీసియిచ్చును. నర్తకి దాని నందుకొని కన్నుల కద్దుకొని నమస్కరించి లోనికి వెళ్ళిపోవును]

నార : ధర్మనందనుడు వేదవిదుడే కాదు. రసజ్ఞవిదుడు కూడ ఆశ్రితుల అర్హతలనెరిగి సన్మానించును.

అశ్వ : కొలువుచేయువారల శక్తి సామర్థ్యములను గుర్తించి తగినట్లుగా సన్మానించుట ప్రభువుల కర్తవ్యము.

నార : ముమ్మాటికీ! రాజులు రాచమర్యాదలను పాటించవలెను. సర్వధర్మములు తెలిసిన ధర్మరాజు రాచరిక గౌరవమునకు భంగము రానిచ్చునా?

దుర్యో: మామా! తదుపరి కార్యక్రమమేమి ?

శకు : చదరంగ మాడుదురా ?

దుర్యో: నా కభ్యంతరము లేదు.

శకు : కాని ధర్మరాజునకందు ప్రావీణ్యము లేదు. కాన అతనికి నేర్పుగల జూదమునే ఆడుదము.

నార : జూదమునందు చేయి తిరిగినవాడే ధర్మరాజు.

అశ్వ : జూదము సప్తవ్యసనములలో నొకటి.

కర్ణు : కావచ్చు. కాని సుక్షత్రియుల కది దోషముకాదు. యుధిష్ఠిరుడు సుక్షత్రియుడు కాడా ?

అర్జు : కర్ణా నీ నీచవంశ గుణమును బయటపెట్టుకొంటివి ?

దుశ్శా : అర్జునా! సంకరము కాని వంశమేదైనను గొప్పదియే!

భీము : దుశ్శాసనా ! ఎవరితల్లి పుట్టిల్లు ఎవ్వరెరుగరు ? నీ డంబములు చాలింపుము.

నార : తీగ లాగినచో డొంకంతయు కదులును. అవన్నియు నీ సంతోష సమయమునందేల! కార్యము చూడుడు.

ధర్మ : మామ! పాచికలు తెప్పింపుము.

శకు : ఇవిగో సిద్ధముగనేయున్నవి రమ్ము. [పాచికలాడించుచు కంబళిపై కూర్చుండును.]

ధర్మ : [అతని కెదురుగా కంబళిపై కూర్చుండును.]

నార : ధర్మరాజా! అగ్రాసనమునుండి అపీఠోతమునకు వచ్చితివి! మెలకువగా నాడుము.

ధర్మ : మునీంద్రా! ఆసీనుని బట్టి యాసనము రాణించును గాక - ఆసనమును బట్టి యాసీనుడు కాదు.

నార : నిక్కమంతివే! కానిండు? చూచి యానందింతుము. సమర్థులు ఆడి యానందింతురు. - అసమర్థులు చూచి యానందింతురు. అశ్వత్థామా! మనము చూడవలసిన వారమేగాని ఆడదగినవారము కాదుకదా!

అశ్వ : అవును మునీంద్రా!

దుర్యో : అన్నా! ధర్మనందనా! శకునిమామ నాపక్షమున నాడును. అతని జయాపజయములు నావిగా భావింపుము. నీకు సమ్మతమేనా?

ధర్మ : సరియే అటులే కానిమ్ము.

శకు : నీ పందెమేమి సుయోధనా!

దుర్యో: ధనాగారమున నిలువయున్న నవరత్న సువర్ణరాసులు సర్వమును.

శకు : నీ పందెమేమి! ధర్మరాజా!

ధర్మ : మాకున్న ధనకనక వస్తువాహనములన్నియును.

శకు : సరియే! [పాచికలు విసరి] అదృష్టవంతుడవోయి ధర్మరాజా! మొదటి పందెము నీదేనయ్యా.

అశ్వ : జూదమునందలి గెలుపోటములు నమ్మరానివి.

నార ; అవును. అనుకోనకుండా గాలిమారవచ్చును.

శకు : దుర్యోధనా! యీసారి నీ పందెమేమి?

దుర్యో: రథాశ్వగజ బలములు సమస్తమును.

శకు : నీ పందెము ధర్మరాజా?

ధర్మ : మా సర్వ సేనాబలమును.

శకు ; [పాచికలు విసరి] ఈ పందెముకూడ నీదేనయ్యా ధర్మజా !

దుశ్శా: మోసము ! శకునిమామ పాండవ పక్షపాతముతో నాడుచున్నాడు. దాయాదియైనను ధర్మరాజు ధర్మబద్ధుడు కావున పాచికలు ధర్మరాజే వేయవలెను.

శకు : [నవ్వి] దుశ్శాసనా ! నాకు రానున్న అపవాదును తొలగించితివి. అట్లే చేయుదము. ధర్మరాజా ఇవిగో పాచికలు! [ఇచ్చును]

ధర్మ ; సుయోధనా! యీ సారి నీ పందెమేమి ?

నార ; చేయిమారినది అదృష్టము తిరగవచ్చును.

దుర్యో: ఈసారి నాపందెము కౌరవ సామ్రాజ్యమంతయును. మీ పందెమందులకు సమానముగా నుండవలయును.

ధర్మ ; ఇంతవరకు మేము గెలుచుకొన్న దానితోపాటు మా రాజ్యభాగమంతయును. ఇక పాచికలు వేయుదునా !

దుర్యో; నిరభ్యంతరముగా !

ధర్మ ; [పాచికలువేసి త్రుళ్ళిపడి] పందెమునీదే సుయోధనా!

దుశ్శా; భళా! ఒక్క దెబ్బతో నూడివచ్చినది

అశ్వ ; ధర్మరాజా! చేజేతుల చేసికొంటివయ్యా.

నార ; అప్పుడే యేమైనది! ఈ సారిచూడు.

దుశ్శా : ఇంకను చూచుటకు పాండవులకు మిగిలినదేమి !
మనుష్యులు మాత్రము తప్పినారు

నార : చాలదా! నాలుగు దిక్కులను జయించిన నలుగురు
తమ్ములుండగా ధర్మరాజున కన్నియు నున్నట్లేకదా.

దుర్యో: నా పందెము పాండవులనుండి పొందినదంతయును.

నార : ధర్మరాజా! మంచి యవకాశము. చేయి తిరుగవచ్చు.
పోయిన దంతయు రావచ్చు: తబ్బిబ్బుపడక నిబ్బరించు
కొని వేయుము.

ధర్మ : నా పందెము నలుగురు తమ్ములును.

భీము ; అగ్రజా! ఆలోచించియే ఆడుచున్నారా?

అర్జు ; ధర్మనందనా! మీకు మేము చెప్పువారము గాము.
సదా మీ యాజ్ఞానువర్తులము. అయినను మా మనవి
విని యాజూద మింతటితోనైన చాలించరాదా ?

శకు : ధర్మజా! పందెము పల్కితివికదా! పాచికలు వేయుము

ధర్మ : [పాచికలు వేసి తలవంచుకొనును]

శకు : భీమార్జున నకుల సహదేవులు కౌరవుల వశమైనారు.

దుశ్శా: వశులగుట కాదు. దాసులైనారు.

భీము : అగ్రజా! ఇంకనైననూ మానుము. మీరైనమిగిలిన
మాకు మనశ్శాంతి దక్కును.

అర్జు : అవును మహానుభావా! మేమెంత కష్టపడినను మాకు
విచారములేదు. మీరు పరుల యింట దాస్యము
చేయుట మేము చూడలేము. ఇంకనైన మానుట
మంచిది.

నార : సోదర వాత్సల్యమన్న నది! అంతకు మించిన వాత్స ల్యాను రాగములుగల ధర్మరాజు తమ్ములను దాసు లుగాచేసి తాను సుఖపడునంతటి స్వార్థపరుడా!

ధర్మ : ఈసారి నన్ను నేనే పణముగా బెట్టుకొనుచున్నాను.

దుర్యో: నీ వొక్కడవుచాలు. సమస్త సంపదలకు సమాను డవు. మీరోడి పోయినదంతయు నాపణము.

నార : భీమార్జున నకుల సహదేవులతో సహా కదా

దుర్యో : అవును మునీంద్రా! యీ పందెము గెలిచినచో పాండవులకు నల్లపూసకూడ నష్టముండదు.

దుశ్శా: ఓడినచో కట్టబట్ట నిలువనీడకూడ నుండదు.

శకు : సరి! పాచికలు విసురుము ధర్మజా!

ధర్మ : [పాచికలువేసి కన్నులు మూసికొనును]

శకు : అయినది! అయిపోయినది! సర్వమును అయిపోయినది. పాండవులు సర్వము నోడి తాము దాసులైనారు.

అశ్వ : అన్యాయము. వినోదమునకై ప్రారంభించిన యాట విలయమునకు దారితీసినది. ఇందేదో కుతంత్రమున్నది.

కర్ణ : అశ్వత్థామా! నీకు మంత్రములుతప్ప తంత్రములురావు.

అశ్వ : కర్ణా! పిలువని పేరంటమునకు రాకు.

కర్ణ : నిన్ను బొట్టుపెట్టి పిలిచితిరా యేమి?

దుర్యో : మీకెందులకయ్యా వృధా కలహము? ఓడినను గెలిచినను లాభనష్టము లనుభవించువారము మేము. మామా! ఆట ముగిసినదా? ఇంకను సాగనున్నదా?

దుశ్శా; ఆడుటకింకేమున్నది పాండవులకు ?

కర్ణు : ఉన్నదికదా ఉమ్మడిసొత్తు పాంచాలి.

భీము : సూతపుత్రా! మర్యాదహీనముగా మాట్లాడకుము.

కర్ణు : వాయుపుత్రా! మర్యాద యను మాటకర్థము తెలియునా? భార్యకైదుగురు భర్తలుగల నీకు మర్యాద కావలయునా?

అర్జు ; రాధేయ! వదరుబోతువై ప్రేలకుము.

కర్ణు : ఇంద్రసూతీ! మీరిప్పుడు రారాజునకు సేవకులు. మా వంటి సామంతులతో సమానముగా సభలో కూర్చుండుటకు మాట్లాడుటకు అర్హతలేదు నీకు. నోరుమూసికొని పడియుండుము.

దుర్యో : అవును. అస్త్రవిద్యా ప్రదర్శనమునాడు తులారణములో కర్ణుడు విజయము సాధించు తరుణములో సాటివాడు కాదను సాకుతో నేకదా రణమాపించిరి. ఇప్పుడు దాసులైన మీరు సామంతులతో మాట్లాడుటకైన అర్హులా? మామా! ఆట ముగిసినదా ?

అశ్వ : ధర్మరాజు తన్నోడిపోయి దాసుడైనాడు. ఇక జూదమాడుటకు అర్హతలేదు, ఆట నాపవలెను.

కర్ణు : జూదమప్పుడు ప్రారంభము కాలేదు. ప్రారంభమైన తరుణములో నతడు రారాజునకు జోడైనవాడే. ఆట ముగియువరకు నదే అర్హత అతనికుండును. ఇప్పుడు ముగిసినచో తిరిగి యాడుటకు మాత్రముండదు.

శకు ; ఏమి ధర్మజా! ఆడుదువా? ముగింతువా!

ధర్మ : నా పందెముగా ద్రౌపదిని బెట్టుచున్నాను.

భీము ; అగ్రజా! మీకు మతిభ్రమణము కలిగినదా! అగ్నిలో పుట్టి పాండువంశమున మెట్టిన ఇల్లాలిని జూదములో పణముగా బెట్టుదురా!

నార ; ఆమె అదృష్టముతో నన్నియు దిరిగి రావచ్చునుగదా.

అర్జు : ధర్మరాజా! నావిన్నపమాలకింపుము. ఎందఱన్నెరుగని యిల్లాలు ఇప్పటికే పడరాని యిడుములు పడినది. ఇంకను ఆమెను హింసించుట భావ్యముకాదు. భోగ భాగ్యములు సిరిసంపదలు లేకున్న వాటిని మించిన స్వేచ్ఛాస్వాతంత్ర్యము లామెకింకను మిగిలియున్నవి. అవియైన దక్కనీయుము.

ధర్మ ; తమ్ములారా! జరుగవలసినది జరిగియే తీరును. మీరూరడిల్లుడు. సుయోధనా! నీ పందెమేమి?

దుర్యో; ఇదియే చివరి పందెము గావున నేను న్యాయముగా వర్తించి పాండవులకు చక్కటి అవకాశ మిచ్చుచున్నాను. ధర్మరాజా యీ పందెములో నీవు గెలిచినచో మీ కోడినవన్నియు దిరిగి మీకిచ్చి వేతును. నేను గెలిచినచో మీతో బాటు ద్రౌపదికూడ మా యింట దాసి యగును.

కర్ణు ; అందరొక్కచోటనే యుండవచ్చును.

నార ; సుయోధనా! నీ పందెముదాత్తముగా నున్నదయ్యా!

శకు ; ధర్మరాజా! కడసారి పందెము నీవు వేయుదువా! నన్ను వేయమందువా! నీ యిష్టము!

ధర్మ ; నేను వేసిన ప్రతిపందెమోడితిని, నీవే వేయుము.

నార : పాచికలో నున్నదిగాని చేతిలో నేమున్నది ?

శకు ; [పాచిక లాడించుచు] చూడుడు! సర్వులునుచూడుడు. ఇందు మోసముగానీ మర్మముగాని లేదు. [పాచికలు విసరి] ధర్మజా! కడసారి పందెము కూడ నీవే ఓడితి వయ్యా !

దుర్యో; [వికటాట్టహాసముచేసి] భళీ ! మామా ! భళీ ! దుశ్శాసనా ఆ పంచభర్తృక పాంచాలిని సభకుపిలుచుకొని రమ్ము, తన భర్తల ప్రయోజకత్వమును కన్నులార గాంచును.

దుశ్శా; [లోనికి వెళ్ళును]

అశ్వ : రాజారాజా! స్త్రీల నవమానించుట పాడికాదు.

కర్ణ ; సార్వభౌముని పరిహాసించుట పాడియా ?

దుర్యో: భూఖండలాఖండలుడనైన నన్నుచూచి యాబింన కి అపహాసించునా? మయసభలో జలరూపమున బటః నన్నుచూచి నవ్వినదికదా ద్రౌపది! అంతకు వేయిం తలుగా నామెను పరాభవించి నాకసితీర నేను నవ్వెద నిప్పుడు.

దుశ్శా; [వచ్చి] ద్రౌపది ఏకవస్త్రయట! రాజాలదట.

దుర్యో; ఏకవస్త్రయైన నేమి విగతవస్త్రయైననేమి? రమ్మనుము. రానిచో జుట్టుపట్టుకొని యీడ్చుకొనిరమ్ము.

దుశ్శా : [లోనికి వెళ్ళును]

అశ్వ : రారాజా ! ఆ పని మంచిది కాదు.

దుర్యో :అశ్వత్థామా! ఇందితరుల జోక్య మనవసరము.

అశ్వ : నీ క్షేమము గోరియే చెప్పుచుంటిని. స్త్రీల కన్నీరు పడిన భూమి వర్ధిల్లదు ప్రజా క్షేమము వంశ క్షేమము గావాడ నీ పని మానుము.

దుర్యో: [తీవ్రముగా] అనవసర ప్రసంగము.

[దుశ్శాసనుడు ద్రౌపది జుట్టుపట్టుకొని లాగికొని వచ్చుచున్నాడు. ఆమెజుట్టు ముడి వీడిపోయి కేశములు నేలాడుచున్నవి. సభలోనికిరాగానే దుశ్శాసను డామెను బలముగా విసురును. ఆమె పడిపోవును.]

భీము ; (ఉద్రేకముతో లేచి) దుశ్శాసనా (గదనెత్తును)

ధర్మ : శాంతింపుము భీమసేనా !

అర్జు : (భీముని పట్టుకొని) అన్నా! శాంతము.

భీము ; (హుంకరించి వెటకారముగా) హు ! శాంతము ! సిగ్గులేకపోయిన సరి.

అర్జు ; మనమన్నమాట జవదాటని వారము.

భీము : అందుల కేనా యీ అవమానము?

ద్రౌప : (నెమ్మదిగా లేచి కూర్చుని) ఆర్యులారా ! ధర్మ వేత్తలారా ! ఇది రాజుల కొలువు కూటమా ! రాక్షసుల బలి పీఠమా ! ఏమిటీ దారుణము ! ఎందులకీ మారణము ! ఎవరిందుకు కారణము !

దుర్యో: ప్రతీకారమే మా పరమ లక్ష్యము

ద్రౌప : ఎందులకు మీ ప్రతీకారము?

దుర్యో: మయసభలో నీవు నన్ను చూచి నవ్వినందులకు,

ద్రౌప; నేనా? మయసభలోనా? నవ్వితినా ?

దుర్యో: అందులకు మా శకుని మామ సాక్ష్యము

శకు : అటుపై ఆ భగవంతుడు సాక్ష్యము.

ద్రౌప : అన్యాయము, కేవల మభూతకల్పన, న్యాయము చెప్పు పెద్దలు లేరా? ఈ దుష్టకార్యమును నివారించు ధర్మవిదులులేరా ? దుర్వారోద్యమ బాహువిక్రమ కళాపారీణులైన యేవురు భర్తలుగల నాకే రక్షణ లేని ఈ సంఘములో నింక సామాన్యులైన ఒక భర్త గల స్త్రీకి రక్షణ యెక్కడిది?

దుశ్శా : (వికటముగానవ్వి) ఒక్క భర్తగల స్త్రీకి ఎప్పుడును రక్షణ గలదు. ఎక్కువ భర్తలుండుటయే దుర్గతి. ఏ భర్తయు తానే భర్తనని ముందుకురాడు.

భీము : ఓరీ కులపాంసనా దుశ్శాసనా! చాలింపుము నీ ప్రలాపములు! లేనిచో (గద నెత్తిలేచును)

ధర్మ ; భీమసేనా! శాంతించి ధర్మమునకు కట్టుబడుము.

భీము : హు! శాంతి! ధర్మము! కాదు నీచేత కానితనము

ద్రౌప : పెద్దలు మాట్లాడరేమి? పండితులు వీరులు తపోధనులు ఇందరున్న యీ కొలువులో ఒక స్త్రీకి పరాభవము జరుగుచుండ వలదని వారించువారు లేరా!

మీ సంఘములో స్త్రీకి గౌరవమింతేనా! వహ్నిలో పుట్టిన నావంటి పవిత్రురాలికే ఇక్కడ స్థానములేదా!

దుర్యో: ఉన్నది పాంచాలీ! ఇదిగో ఇక్కడ నీ స్థానము. [తొడ జూపును]

ద్రౌప: ఛీ! పాపీ! నీ తొడపైనా నాస్థానము! మదగర్వాంధుడవై మానవతుల నవమానించినచో దుర్మరణము పాలగుదువు. పతివ్రతల శాపములు వృధాకావు.

దుర్యో: ఏవురు భర్తలుగల నీవు పవిత్రవా! పతివ్రతవా! మానవతివా! ఒక్కడుగాక ఏవురైన నేమి పదియేవురైన నేమి! [నవ్వును]

భీము ; ఓరీ మానహీనా సుయోధనా! నీకు మరణము దాపైనది. పరకాంతలను గూర్చుంతుమని నీవుచూపిన నీతొడలు విరిచి ఈ యిల్లాలికి మనశ్శాంతిని కలిగించెదను! [వెళ్ళబోవును]

ధర్మ ; (భీముని పట్టుకొని) నాయనా భీమసేనా! కోపమునకిది సమయము కాదు. మనము ధర్మబద్ధులము.

దుర్యో; ధర్మమునకు కాదు. నాయాజ్ఞకు బద్ధులు.

భీము : ఓరీ దుష్టదుర్యోధనా! ధర్మరాజు కారణముగా నిప్పుడు బ్రతికి బయటపడినను నీవు నా చేతులతో చావక తప్పదు. ఏనాటికైన రణరంగమున మదీయ

చండప్రచండ గదాదండముతో నీ తొడలు విరుగ
గొట్టకమానను దైవముపై నాన.

దుర్యో: పోటులేనివాడికే మాటలెక్కువ.

కర్ణ : ఆలిని కొప్పుపట్టుకొని సభ కీడ్చి తెచ్చినప్పుడు
చూచుచు నూరుకొన్న దద్దమ్మలు ఎప్పుడో యుద్ధ
ములో కొట్టుదురట! మీ రాజన్న బానిసలు. బాని
సలుగానే చత్తురు. కురురాజుతో యుద్ధము చేయు
నర్హత మీకు లేదు. అవకాశము రాదు.

అర్జు ; ఓరీ సూతపుత్రా! రారాజు అండచూచుకొని కారులు
ప్రేలుచుంటివా ! మేము బానిసలమో బలవంతు
లమో నీకిప్పుడు తెలియదు. రణరంగమున నీవు నా
కెదురుపడినప్పుడు తెలియునులే. నీ వెంత వేడినను
చిత్రవధ చేయుదును.

కర్ణ : అయినవా మీ ప్రతిజ్ఞలు? అసమర్థులకే అతివాగుడు.
ఊరకుక్క లరచినట్లుగా బీరము లాడుటతప్ప మీరు
చేయగలిగిన దేమున్నది?

దుర్యో: అవును. మీరు చేయగలిగిన దేదో చేయుడు మీ
చేవయు లావు చూచెదము. దుశ్శాసనా ఆ యేక
వస్త్రను విగత వస్త్రను చేయుము.

ద్రౌప : ఛీ! కులపాంసనా! కోరినాశనము కాకుము.

దుశ్శా: (పైట పట్టుకొనును)

ద్రౌప : (విడిపించుకొని దూరముగా వెళ్ళి) పాపీ! పైశాచిక
ప్రవృత్తికి పాల్పడకుము. దూరముగా నుండుము.

దుశ్శా : శపింతువా? మహా పతివ్రతవు. [మీదికి వెళ్ళును]

ద్రౌప : [విడిపించుకొని] రాక్షసుడా। రాజసూయావభృథ స్నానముచే పవిత్రమైన నా పెన్నెరివేణి నీ కరములు దాకి కళంక పడినది. ఈ వెంట్రుకలు పట్టి యీడ్చిన నీ చేయి తునాతునకలై నీవు నేల గూలిన గాని నా మనస్తాపము చల్లారదు. నీ మరణము జూచువరకు నేనీ జుట్టు ముడివేయను.

దుశ్శా: ఓహో! నీవుకూడ ప్రతిజ్ఞ చేయుచుంటివా ?

భీము : ఓరీ దుశ్శాసనా! పదుగురి ముందు వనితను కొప్పు పట్టుకొని వలువలూడదీయ సంకల్పించితివి. పదివేల మంది చూచుచుండగా నీగుండెలు చీల్చి నీకవోష్ణరుధిరధారలతో పాంచాలి కేశముల కంటిన కళంకము కడిగి ఆమెజుట్టును నేనుముడివేయుదునురా దురాత్మా.

దుర్యో: సైచినకొలదికారులు ప్రేలుచున్నారు. దుశ్శాసనా చూచెద వేల? ఈ యసమర్థులేమి చేయుదురో చూచెదముగాక, ఆమె బట్టలూడదీయుము.

దుశ్శా: [పైట బట్టుకొని] ఇంకతప్పించుకోలేవు.

ద్రౌప : ధర్మము కాపాడువారు లేరా? అవినీతిని నివారింపగల నీతిమంతులు కారా మీరు? దైవమా! హే శ్రీకృష్ణ పరమాత్మా! ఆర్తత్రాణ పరాయణా! నీవే నాకుదిక్కు. అన్నా నన్ను గాపాడుము. కృష్ణా! జగద్రక్షకా! మాధవా। సత్యభామాధవా పాహిమాం।

దుశ్శా: ఆ మాయావి కృష్ణుడు వచ్చి నిన్ను కాపాడునా!
సరే రమ్మనుము. వాని సంగతి కూడ తేల్తును.
[లాగుచు]

ద్రౌప: [చేతులుజోడించి దండకము చదువును] శ్రీమానినీ
కామితాకార! గోపాలబాలా! శుభాకార! వీరా! జగ
దేతుహేతుప్రకారా! భవత్పూర్ణ కారుణ్యగణ్యాయిక
వీక్షింగటాక్షింపవే! భక్తమందారమా! ధర్మసంస్థా
పకా! భద్రసంధాయకా! వేగ రక్షించు దేవా!
ముకుందా! మురారీ! ప్రభో పాహిమాం! పాహి నారా
యణా! కృష్ణదేవా! నమస్తే! నమస్తే నమః మూర్ఛ
పడి పోవును).

దుశ్శా; మాయలాడీ నీ నటనలు చాలింపుము. తెలివితప్పి
పడినట్లు నటించిన విడిచి పుత్తునా? నీ శవమునైన నగ్న
వికృత వస్త్రను చేతును. (లాగును).

భాను: (తొందరగా వచ్చును) దుశ్శాసనా! ఆగు.

నార; (సంభ్రమముతో) కృష్ణా! కృష్ణా! శ్రీకృష్ణా!

దుశ్శా: కృష్ణుడా? ఎక్కడ?

భాను: నేను దుశ్శాసనా!

దుశ్శా: వదినా! మీరా? (చీరవిడుచును)

కర్ణ: భానుమతీ మహారాజ్ఞియా!

దుర్యో: దేవీ! నీవా! ఇచ్చటకు వచ్చితివా!

భాను: ప్రభువులు నన్ను క్షమింతురు గాక. సోదరులు పెద్దలు తాపసోత్తములు బంధువులు నన్ను మన్నింతురుగాక. ఒక స్త్రీకి జరుగుచున్న కష్టమును విని భరింపలేక కొలువులో నడుగు పెట్టితిని.

దుర్యో: నీవు రాదగు సమయముగానీ స్థలముగానీ కాదిది.

భాను: కాదనను ప్రభూ! మీ భార్యపట్ల మీ కెంత గౌరవమో వారి భార్యయందు వారికిగూడ నంతగౌరవ ముండునుకదా వారి బాధను మీదిగానెంచి మీ యత్నము మానుడని వేడవచ్చితిని.

దుర్యో; అవాచ్యములు పలుకకుము దేవీ! కురుసార్వభౌముని పట్టమహిషివైన నీకును—పనికిమాలిన యేవురు భర్తలు గల యీ బంధకికి పోలికయా! మమ్ము పరాభవించిన యీ ద్రౌపదిని పదింతలుగా నవమానించిన గాని మా పగ చల్లారదు.

భాను: అందుల కేమి చేయుదలచినారు!

దుర్యో; ఆమెను విగతవస్త్రను చేయుచుంటిమి.

భాను; (నవ్వును) భళి భళీ! (మరల నవ్వును)

దుర్యో; దేవీ యెందులకా నవ్వు !

భాను: అవును ప్రభూ! మిమ్ములను మీరే అవమానించుకొన ప్రయత్నించుచున్నందుకు నవ్వువచ్చినది.

దుర్యో: మమ్ములను మేమే అవమానించుకొనుచుంటిమా!

భాను; ఒక వ్యక్తిని నగ్నముగా నిలిపినచో అవమాన మా వ్యక్తిదికాదు. ఆ వ్యక్తిని-చూచువారలది!

దుర్యో; క్రొత్త సిద్ధాంతమునే ప్రతిపాదించు చుంటివే!

భాను: ఇది క్రొత్తది కాదు. సత్యము సనాతనము.

దుర్యో; అదెట్లు దేవీ! వివరింపగలవా!

భాను: మానవులు వస్త్రములు ధరించుట తమును దాము కాపాడుకొనుటకు కాదు ఎదుటివారిని గౌరవించుటకు. ఎవరైన నగ్నముగా మీ దర్శనమునకై వచ్చినచో మీరు వారిని క్షమింతురా! ఎందువల్ల ! నగ్నముగా నుండుటన్న ఎదుటివారిని తిరస్కరించుటయే! అందు వల్లనే కదా వస్త్రహీనులను చూడనొల్లము. మీ యెదుట నొక స్త్రీని నగ్నముగా నిలుపుటన్న మిమ్ము మీరు పరాభవించుకొనుట! మీతో నున్నవారినెల్ల పరాభవించుట. ఈమెను విగతవస్త్రను చేసినచో నా యవమానము మీది. ఆ పరాభవము మీ అందరిది.

కర్ణు: అమ్మా! అర్థాంతరమును సాధించి నూతన సిద్ధాంతమును ప్రతిపాదించితిరి.

భాను: అన్నా! వస్త్రధారణలోని మర్మమిదియే! ప్రభువులను చూడబోవునపుడు సామంతులు మేలివస్త్రములు ధరించుట ప్రభువులను గౌరవించుటకే!

దుర్యో: దేవీ! నీ వాదన మే మంగీకరింతుము. కానీ యీ బంధకిని పరాభవించి తీరవలయును.

భాను; అందులకు మార్గాంతరము లేదా! మరొకమాట! రాగ ద్వేషములను దరిరానీక నే చెప్పినదాలింతురా?

దుర్యో: సావధానులమై యున్నారము.

భాను: ధృతరాష్ట్ర మహారాజు పాండవుల కర్ధరాజ్యమిచ్చి వారిని స్వతంత్రుల జేసినారు. పాండవాగ్రజుడు సర్వ స్వతంత్రుడు కావున తన సర్వస్వమును తన యిష్టము వచ్చినట్లు చేసికొనవచ్చును. కానీ మీరు స్వతంత్రులు గారు. మీరాడిన పందెములు చెల్లవు.

దుర్యో: ఈ రాజ్యము నాది. నా యిష్టము వచ్చినట్లు చేయ గలను.

భాను: ఆ యధికారము మీకు లేదు. భీష్ములవారు రాజరిక మును నిరాకరించుటచే ధృతరాష్ట్రులవారు రాజయి నారు. మీకు యౌవరాజ్య పట్టాభిషేకము మాత్రమే జరిగినది. మీరు రాజప్రతినిధియేగాని రాజుకాదు. ప్రస్తుతమున్న రాజున్నంతవరకు–లేదా మీకు సర్వాధి కారము దత్తమగు వరకు రాజ్యము మీ స్వంతము కాదు. అందువల్లనే మీ పందెము చెల్లదు. పందెమే చెల్లనపుడిక జయాపజయముల ప్రసక్తి యెక్కడిది!

కర్ణ: భానుమతీదేవి చెప్పునది న్యాయము.

దుర్యో: ఆవాదము మేమంగీకరింపము. మా తండ్రి నామ మాత్రమునకు రాజు. రాజు అంధుడు. నాకు యుక్త వయసు వచ్చినప్పటినుంచియు రాచ కార్యములు నేనే నెరపుచుంటిని. కావుననే రాజ్యాంగరీత్యా నాకు సర్వాధికారములున్నవి.

భాను; ప్రభూ! మీ యధికారమును నేను గుర్తింతును - గౌర వింతును - గర్వింతును. కానీ విజ్ఞలోకము తమను నీతిదూరుడని నిందించును. భర్త నీతిహీనుడు-అధర్మ వర్తనుడని లోకులు నిందింప సామాన్య స్త్రీయే విని భరింపలేదు. భావి కౌరవ సామ్రాజ్య సర్వ - సర్వం సహాచక్ర - చక్రవర్తికి పట్టపురాణినైన నేనట్టి అప ఖ్యాతిని పొంది భరింపగలనా ప్రభూ? మీమనసులోని మనసుగా నన్ను ప్రేమించి గౌరవింతురే! మీరే నాకు మనస్తాపము కలిగింతురా ప్రభూ?

దుర్యో: దేవీ! నీ మనసు మాకర్థమైనది. నీ మనసునొచ్చుట మనసు నొచ్చుటయే! ఏమి నీ యభీష్టము?

భాను; ద్రౌపది చేసిన నేరమేమైనను న్నచో ఆమె పక్షమున నేను క్షమాపణ చెప్పుకొనుచున్నాను.

దుర్యో: నీ కెందులకా పక్షపాతము?

భాను; ఆమె నా సోదరి. సాటి ముగనాలు. నా మాట మన్నించి మీరు తలపెట్టిన అకార్యమును మానుడు.

దుర్యో : [నిట్టూర్చి] సరియే ! నీ కోరిక మన్నించితిమి. దుశ్శాసనా! ఆమెను విడిచి పుచ్చుము.

భాను : పాండవులోడిపోయిన దానినంతను తిరిగి వారికిచ్చి వేయుడు. మీరు రాజ్యములే పందెముగా బెట్టి జూద మాడదలచినచో ధృతరాష్ట్రులవారి అనుమతి పొంది మరల నాడుకొనుడు.

దుర్యో : అనవసరము. రాజుగా శాసించుచున్నాను. ఆడిన పందెమే స్థిరపరచు చున్నాము.

భాను : అయినచో నీ పందెము చెల్లదని మహారాజ్ఞిగా నేను ఆదేశించుచున్నాను.

దుర్యో ; దేవీ! హద్దులు మీరుట మంచిదికాదు.

భాను ; నా యీ వేదనగూడ నదియే ప్రభూ ! నాయందలి అనురాగము చేనైన నాకోరిక మన్నింపుడు. దానము చేసిరనుకొని వారిది వారికిచ్చి వేయుడు. మనసంపద లలో నది యెంత! మీరు నామాట కాదన్న నిక నాకు మరణమే శరణ్యము. భర్త దోర్మార్గవర్తనుడని ప్రజల నోట వినుటకన్న చచ్చుట మేలు. [కన్నీరొత్తు కొనును]

దుర్యో ; దేవీ! కంట నీరు పెట్టకుము. మేము చూడలేము. నీవు కోరినట్లే పాండవులను స్వతంత్రుల జేసి వారి యావదాస్తిని తిరిగి వారికిచ్చు చున్నాము. ధర్మాజా! మీ ఇల్లాలు మూలముగా పోయిన రాజ్యము మా

అర్థాంగి దాక్షిణ్యముచే తిరిగి మీకు లభించినది. ఇక పోవచ్చును. దేవీ నీవంతఃపురమున కరుగుము!

భాను; మహాప్రసాదము.

దుర్యో ; కర్ణా! మామా! దుశ్శాసనా! రండు మనము ధృతిరాష్ట్ర మహారాజును సందర్శింతము. (నలుగురు బయటకు వెళ్ళుదురు)

నారః అశ్వత్థామా! వీరు ధృతరాష్ట్రునితో నేమి చెప్పదురో! నీవు పోయి యదార్థమును తెలుపుము.

అశ్వ ; మంచిది మునీంద్రా! సెలవు. (బయటకు వెళ్ళును)

ధర్మ; అమ్మా భానుమతీ! మా పరువు నిలిపితివి. దీవించవలసిన వాడనైనను చేయెత్తి నమస్కరించుచున్నాను,

భాను ; [నవ్వి] బావలు నన్ను పొగడకూడదు. నన్ను నమ్ముకొన్న నా చెల్లెలి భారము నాదికదా. [ద్రౌపది చెంత కూర్చుండి సోదరీ! ద్రౌపదీ! లెమ్మా.

[ఒక్కసారిగా లైట్లన్నియు నారిపోవును. క్షణమాగి స్పాట్ లైట్లు వెలుగును భానుమతి స్థానములో అదే విధముగా శ్రీకృష్ణుడు కూర్చుని యుండును, అందరు సంభ్రమాశ్చర్యములతో కృష్ణా, కృష్ణా యందురు. ఆ మాటలకు ద్రౌపదికి తెలివివచ్చును లైట్లు వెలుగును,

ద్రౌప ; కృష్ణా! జగద్రక్షకా! పాహిమాం!

శ్రీకృః సోదరీ! భయము లేదు లెమ్మా.

ద్రౌప ; [త్రుళ్ళిపడి లేచి] అన్నా! అన్నా! (నమస్కరించును)

శ్రీకృ ; అమ్మా! భయపడకుము.

అర్జు ; ఆర్తత్రాణపరాయణా! నీరుణమెట్లు తీర్చుకొందుము

శ్రీకృ: ఆ మాటలు తర్వాత. ఇక్కడ జరిగినది విని మీ తల్లి కుంతీదేవి దుఃఖించుచున్నది. నకుల సహదేవులామెను ఓదార్చలేకున్నారు. ధర్మరాజా! ద్రౌపదిని వెంటబెట్టుకొని తొందరగా మీ తల్లి చెంతకేగుడు.

ధర్మ : నీ యాజ్ఞ శిరసావహింతుము యాదునందనా.

ద్రౌప: అన్నా! మరల దర్శనమిప్పింపుము.

శ్రీకృ: మంచిది మీరు నడువుడు.

(ధర్మరాజు భీముడు అర్జునుడు ద్రౌపది బయటకు వెళ్ళి పోదురు).

నార : ద్రౌపదీ మానసంరక్షకా! గోపికా మనోవల్లభా! నీనటన మెంత అద్భుతముగా నున్నదయ్యా! ఇందువల్లనే అమృతము పంచునాడు రాక్షసులు వరగర్విష్టియైన భస్మాసురుడు నీ స్త్రీ వేషముచూచి మోసపోయినారు.

శ్రీకృ: సరి సరి! నీ పొగడ్తలతో నన్ను మోసపుచ్చకుము.

నార : హరిహరి! ఎంతమాట! అవునుగాని కృష్ణా పాండవుల భాగము తిరిగి ఇప్పించి వైచితివే! ఇందలి పరమార్థమేమో వివరింతువా?

శ్రీకృ: ధృతరాష్ట్రునకు పాండవులన్న ప్రక్క బెదురు. పాండవులను నాశనము చేయవలయుననియే అతని తలంపు. అతడు దుర్యోధనుని మాట కాదనడు. దుర్యోధనుడు తండ్రినొప్పించి మరల జూదమాడును.

నార : జూదమునకు పిలిచినచో ధర్మరాజు కాదనడు.

శ్రీకృ: కాదన్నచో కథయేలేదు పాండవులిచ్చట దాసులై పడియున్న జరుగవలసినవన్నియు నెట్లు జరుగును? తిరిగి జూదమాడుదురు. ఈసారి పందెములు మరియొక విధముగా నుండును. అవి పూర్తియగుసరికి కాలము దాపురించును. సంఖ్య పూర్తియగును. కలహమునకు కారణము లభించును.

నార : ఆకలి మిక్కుటమగుచున్నది కృష్ణా.

శ్రీకృ: విందు భోజనము తిందువుగాని రమ్ము.

(ఇరువురు వెళ్ళిపోవుచుండగా తెరపడును.)

# కౌరవ పాండవీయం

## నాలుగవ రంగము

[తెరబయట నారదుడు పాడుచు వచ్చును.]

నార : కరుణింపుమా మాధవా

మొరలాలింపుమా సత్యభామాధవా ॥క॥

తమ పదవులకై ప్రజహింసించే
కుమతుల పాలన తొలగించీ
న్యాయము కొరకై నిలిచే వారికి
సాయముచేసి గెలిపించీ
మానవ సంఘము బ్రోవుమయా
దానవ నైజము బాపుమయా ॥క॥

మోసము స్వార్థము హింసాకాండ
కూహు విద్యలెన్నొ పెరుగుచున్నవి
దారిద్ర్యము అశాంతి నైచ్యము
తారస్థాయికి అరుగుచున్నవి
దారుణమాపీ కాపాడుమయా
ధారుణి భారము తీర్చుమయా ॥క॥

(పాట ముగియగానే నారదుడు వెళ్ళిపోవును. వెంటనే తెరలేచును
అది శ్రీకృష్ణుని విశ్రాంతి మందిరము. ఊగుటుయ్యాలపై కూర్చుని

శ్రీకృష్ణుడు మురళి మోగించుచుండును. దూరముగా పాదములవైపు నొక సువర్ణాపనము మాత్రముండును.)

నారద : ( బయటినుండివచ్చి) హరిః ఓం! హరి ఓం !

శ్రీకృ: ఏమి నారదా! మరియు వంగి వంగి నమస్కారములు చేయుచుంటివి ? ఏమైన ప్రమాదము రానున్నదా!

నారద ; ఏమి చెప్పుదును కృష్ణా! కడుపాకలితో మండిపోవు చున్నది. భోజనము దొరకనిచో నాకే ప్రమాదము.

శ్రీకృ: నీ భోజనము ఇతరులకు ప్రమాదము.

నారద : ఏదీ కలహా మొక్కటియైన కలుగకున్నది.

శ్రీకృ: నీకు పుణ్యముండునుగాని నీయాకలికి ఆహారము నా యింటను మాత్రము సృష్టింపకుము.

నారద : హరి హరి! నేనెప్పుడు చేసితినయ్యా అంతపని !

శ్రీకృ: పారిజాతము తెచ్చి పడతీ పదతాడనం చవిచూపితివి. తులాభారము నెపముతో నా బ్రతుకే నడివీధిని బెట్టి వేలము వేసితివి. చాలదా నారదా!

నారద ; నన్నాడిపోయుట కనుచుంటివిగాని నీకు తెలియకుండ జరిగిన దేమున్నదయ్యా మహానుభావా ?

శ్రీకృ: నాకేమి తెలియునయ్యా నారదా !

నారద : అయ్యో దేవ! నీకేమి తెలియును? ఈనారదునిచే పన్నాగములు పన్నించి సజ్జనులచే దుర్జనుల నిర్జింప జేసి పైనుండి యానందించుట మాత్రము తెలియును.

శ్రీకృ: నీ పన్నాగము గయుని వంకతో నాపై నే నెట్టితివి కదా.

నారద : ఆర్తత్రాణ పరాయణుడని - ఆడితప్పనివాడని నీ ముద్దుల బావమరిది అర్జునునకు బిరుదము లిచ్చుటకు నీ వెత్తిన యెత్తుగడగాక మరేమున్నది గయోపాఖ్యానము!

శ్రీకృ: అన్నిటికి అన్ని కారణములు చెప్పుచున్నావు.

నారద : దానికి కూడా కారణము నీవే కదా పరమాత్మా!

శ్రీకృ: వ్యాఖ్యానములు చాలించి విశేషములు చెప్పుము.

నారద ; నీకు తెలియనివి నాకేమి తెలియునయ్యా!

శ్రీకృ: లోకము లన్నియు సుఖముగా నున్నవా!

నారద : ఆహా! ఒక్క భూలోకము తప్ప

శ్రీకృ ; అదేందు చేత నారదా!

నారద : నీ విచ్చట నున్నావు గనుక.

శ్రీకృ: నే నున్నచోట సుఖముండదా!

నారద : సుఖమున్నచోట నీ వుండవు ఎప్పుడెక్కడ అన్యాయమూ అధర్మము ప్రబలునో అప్పుడక్కడ అవతరించి దుష్టశిక్షణము శిష్టరక్షణము గావించి శాంతి ధర్మాలను స్థాపించు జగన్నాథుడవు నీ విచ్చట నున్నావు గనుక - ఇక్కడ సుఖశాంతులు లేవని తెల్లమగుచున్నది.

శ్రీకృ: అయినదా నీ సమన్వయము!

నార : అసలు విషయమే అన్వయమగుట లేదు.

శ్రీకృ: ఏమిటది నారదా ?

నార : ఘోషయాత్ర నాటి గోడు మరచి దుర్యోధనుడు గోగ్రహణము చేసినను నీ దయవల్ల పాండవులు అరణ్యాజ్ఞాతవాసములు విజయవంతముగా ముగించిరి కదా. జూదమునాటి నిర్ణయము ప్రకారము పాండవులు తమ అర్ధరాజ్యమును తమకు తిరిగి యిమ్మని అడిగినను ధార్తరాష్ట్రు లంగీకరించుట లేదు కదా ! అయిన యుద్ధము తప్పదా ?

శ్రీకృ: ఏమో! ఎవరు చెప్పగలరు ?

నార : దుర్యోధనుడు బలములను సమకూర్చుకొనుచున్నాడట. మరి పాండవులు నీసాయము కోరలేదా!

శ్రీకృ: నా సాయమా! నేనేమి చేయగలనయ్యా ?

నార : అవును పాపము. వెన్నమాత్రము తినగలవు !

శ్రీకృ: అదియును చిన్నతనమందు.

నార : మరి యిప్పుడు మన్ను తిందువా !

శ్రీకృ; అమ్మ తిట్టనయ్యా నారదా!

నార ! రోటికి గట్టినను నీబుద్ధి పోనిచ్చుకొంటివా! వెన్నయు లేక – మన్నును లేక – నీ బొజ్జలోనున్న పదునాలుగు లోకములను ఏమి చేసితివయ్యా వాసుదేవా!

శ్రీకృ; నిత్యము నీవు తిరిగి చూచుచుంటివి కదా! ఏమి కనుగొంటివి నారదా ?

నార : హేకృష్ణపరమాత్మా ! మాయను జయించినవాడవు నిన్ను మాటలలో జయింప గలమా ! పదునాలుగు లోకములు నీలోనుండగా – ఆ పదునాలుగు లోకము లందు నీవే నిండియుంటివే! నీ మాయను తెలియ నే నెంతవాడను?

శ్రీకృ: సంకీర్తనము చాలించి సమాచారము తెలుపుము. కౌరవులతో బాటు పాండవులు కూడ యుద్ధమునకు సిద్ధమగు చున్నారా?

నార : అనియే వింటిని.

శ్రీకృ: అయిన నీ కడుపు నిండునన్నమాట.

నార : నీ మనోరథము పండునూ గూడ.

శ్రీకృ: గట్టిగా మాట్లాడకుము. గోడలకు చెవులుండును.

నార : ఉన్ననేమి! కన్నులకు చెవులకు దొరకువాడవా నీవు?

శ్రీకృ : నీకు దొరకకుండ తప్పించుకొన్న దెప్పుడు నారదా?

నార : నాతో కాపురముచేసి అరవైమంది బిడ్డలకు తండ్రి వైన నాడైన నాచేతికి చిక్కితివా స్వామీ!

శ్రీకృ : నీవు కోరినచో ఈ క్షణమున చిక్కకుందునా!

నార : దేవా: ఆ అనుగ్రహమే సర్వదా నాపై నిలుపుము.

శ్రీకృ : ద్రుపద పురోహితుని ప్రయత్నము విఫలమైనది. అటు నుంచి సంజయునిచేత వట్టి యూరట మాటలు చెప్పించితిరి. ఇటునుంచి రాయబారము వలదా ? ధర్మజుడు తప్పు పడునా!

నార : అయిన పాండవదూత ఎవరు?

శ్రీకృ : నేనే। శాంతి దూతను కదా !

నార : ఆహా! ఏమి చిత్రము స్వామీ నీలీలలు ? నీకై కౌరవ పాండవులను సృష్టించి కయ్యము మొగిపించి పైగా రాయబారివై సంధిసంప్రదింపులు జరిపెదవా ?

శ్రీకృ : అవును నారదా! ఇది రాజకీయము. రాయబారిని మాత్రమే కాదు - యుద్ధములో సవ్యసాచికి సారధిని గూడ.

నార : ఘటనా ఘటన సమర్థుడవు. ఏమిచేయలేకుందువు ?

శ్రీకృ : నారదా నిద్దురవచ్చుచున్నదయ్యా [పరుండును]

నార : సర్వకాల సర్వావస్థలయందును సకల చరాచర జగత్తును కండియుండు సర్వాంతర్యామికి నిద్దురమైకమా! మాయామానుషవిగ్రహా! వటపత్రశాయివై క్షీర సాగర తరంగమాలికా డోలికల నూగిన నిను బంగరు టుయ్యాలనుంచి జోలపాడిన కౌసల్య యశోదలెంత అదృష్టవంతులో!

శ్రీకృ : నీవుకూడ జోలపాడరాదా! నేను వలదంటినా?

నార : అవును కృష్ణా! ముల్లోకములకన్న ముందు పుట్టిన వాడవయ్యు ముసలితనము లేని ముద్దుబాలుడవు కదా! సరియే। హాయిగా నిద్రపొమ్ము [ఊయలలూపుచు పాడును]

జో అచ్యుతానంద జోజో ముకుందా
లాలి పరమానంద బాలగోవిందా ! జోజో

శ్రీకృ ; నారదా! యుగయుగాలనుంచి అదేపాట విని-విని విసుగెత్తినదయ్యా! ఏదైన కొత్తపాట పాడుము!

నార : సరియేస్వామీ! (అడుగులు వేయుచు పాడును)

అందా చందాలవాడా
గోవింద దేవ బృందావన మేలువాడా ॥అం॥

రాధమ్మతో గూడి రాసలీలలేయాడి
మురిపాలను తూగాడి మురళి మోవిపైనడి
ముల్లోకాలనుగూడ మురిపించితివిపాడి ॥అం॥

శ్రీకృ : అయ్యో నారదా ! అదటయ్యా జోలపాట ? భజన చేయుచు భరతనాట్యమాడిన నిద్రపట్టునా!

నార : ఈ పాటవినుమూస్వామీ (కదవరంగ గానముచేయును)

నిద్రపో! నిద్రపో! నిద్రపోరా
భద్ర సచ్చిదానంద నిద్రపోరా ॥ని॥

కంటిమీద రెప్పవోలె కాచియుందురా
చంటిపాప వోలె నిన్ను చూచుకొందురా
కలతలుమాని కలలురాని
తెలవొందని నిద్రపోరా ॥ని॥

శ్రీకృ ; అయ్యయ్యో నారదా!

నార : ఏమయ్యా మాధవా?

శ్రీకృ ; నీపాట యుద్ధము చేయుటకా నిద్దుర పుచ్చుటకా ?

నార ; ఆ రెండింటిలోను అనుభవము లేని వాడను స్వామీ

శ్రీకృ : లలితముగా పాడుమయ్యా !

నార ; తెలిసినదిస్వామీ! (దుఃఖంతో పాడును)

అయ్యా! అయ్యా!
అయ్యా అని వేడినా ఆలకించి వేమయ్యా
ఆ గజేంద్రమునకైన నేనుసాటిరానయ్యా ॥అ॥

శ్రీకృ ; అః జోలపాట కాదయ్యా! శోకగీతం ! నీవు సంగీత
కళాకోవిదుడవుకదా! ఇదేమి జోలపాటయ్యా !

నార ; నీ దొంగనిద్దురకు తగిన గానమే స్వామీ !

శ్రీకృ : సరిసరి! హాయిగా ఆహ్లాదకరముగా పాడుము.

నార : అటులనేస్వామీ (పాడును)

దినదినము పాపడిని దీవించిపొండి
దేవలోకములోని దేవతల్లారా ॥ది॥

నిదురలో నాబాబు నవ్వుకొనుచుంటాడు
పృథివిపై భారమ్ము పెరిగిపోవుటచూచి
కోపాన నాబుజ్జి కనుబొమలు ముడిచేడు
పాపాత్ములే పూజలందుకొనుటచూచి ॥ది॥

నరహంతకులె నేడు దొరబాబులై నారు
పరపీడనాపరులె ప్రభువులై పోయారు
ఎవరి దృష్టులుసోకి ఏకీడు రాకుండ
అవతారమూర్తికే ఆపదలు రాకుండ ॥ది॥

శ్రీకృ ; (కన్నులుమూసికొని) నారదా! నారదా!

నార ; ఓయి భగవంతుడా! దొంగనిద్దురలో కూడ కలవ రింతలా !

శ్రీకృ; సద్దుచేయక ఆ సువర్ణాసనముపై కూర్చుండుము.

నార ; నీయాజ్ఞ! (పీఠమును కాళ్ళదగ్గరకులాగికూర్చుండును)

శ్రీకృ; పాదముల చెంత కూర్చుండునది భార్య! నీవు –

నార : వలదు వలదు మహాప్రభో! ఆ యనుభవము చాలు!

శ్రీకృ; అట్లయిన తలవైపున కూర్చుండుము.

నార ; మొత్తముమీద నాచేత పీఠములు మోయించు చుంటివి. చూడవచ్చినచుట్టముచేత పామును చంపించి నట్లుగా నాచేత నింకేమి చేయింతువు! (పీఠమును తలవైపువేసి) సరియే! పీఠమును నీతలవైపున వైచితిని.

శ్రీకృ: కూర్చుండుము.

నార : (కూర్చుని) ఆ ! కూర్చుంటిని. ఏమిటి సెలవు ! .... మాట్లాడవేమయ్యా మహానుభావా! నన్నేమి చేయ మందువు ! (దగ్గరకు వెళ్ళి) ఈ మౌనమున కర్థమేమి స్వామీ !

దుర్యో; (వచ్చి) నారదులవారా! ప్రణామము మునీంద్రా!

నార ; ఓ హో హో ! కౌరవ చక్రవర్తి దుర్యోధనుడా ! సార్వభౌమా! ఆ కనకపు సింహాసనముపై కూర్చుం డుము.

దుర్యో: గోపాలుడు పగటిపూట నిద్రించుచున్నాడే!

నార ; దామోదరునకు పగలుగాక రాత్రి తీరిక యెక్కడిది !

దుర్యో: ఇతనికి నిద్రాభంగము చేయుట మంచిదికాదు.

నార : కావుననే ఆకనకపు సింహాసనముపై విశ్రమింపుము.

దుర్యో: మంచిది (కూర్చుండును)

నార : (ఆలోచించి తలపంకించి) కానీ సుయోధనా! నీవంటి సామ్రాట్టు వచ్చి వెర్రిగోపాలుని మ్రోలవేచియుండుట రాచపాడికాదు. మేలుకొలుపుదువా గోపాలుని!

దుర్యో: అవసరార్థి నికదా! వేచియుండుట ధర్మము.

నార ; ఇట్టి స్థితిలో నెవ్వరైన చూచినచో నెంత నగుబాటు! నీయంతటి చక్రవర్తి వెన్నకుమన్నుకు భేదముపాటింపని స్త్రీలోలునికై పడిగాపులు పడియుండుటయా! [వీధి లోనికి చూచి కంగారుగా] సరి సరి! అర్జునుడు వచ్చుచున్నాడు. అతనిదృష్టిలో నీవు చులకనయగుట నాకు సమ్మతముగాదు. శ్రీకృష్ణుని మేలుకొలుపుదము. [తల వైపునిలచి] కృష్ణా! కృష్ణా! మేలుకోవయ్యా నరసఖా! మేలుకో !

శ్రీకృ: [లేచి కూర్చుని కన్నులు తుడుచుకొనుచుండును]

అర్జు : [వచ్చి] మహాత్ములకు వందనములు.

శ్రీకృ; [చూచి] అర్జునా! రావోయి! రా! [కౌగలించుకొనును]

అర్జు : నీ పరిష్వంగముచే పవిత్రుడనైతిని బావా!

శ్రీకృ: అర్జునా! ఎన్నాళ్ళయినది నిన్ను చూచి! ఎక్కడ నుంచి రాక ?

అర్జు : ఉపప్లావ్యము నుంచియే బావా!

శ్రీకృ; అందరు కుశలమేకదా!

అర్జు : నీ దయవల్ల క్షేమమే వాసుదేవా!

శ్రీకృ: ఎక్కడికీ ప్రయాణము? మరల భూప్రదక్షిణమా!

అర్జు : లేదు బావా! నీ దర్శనార్థమే వచ్చితిని.

శ్రీకృ: అయిన నన్ను మేలుకొల్పినది నీవేనా,

నార ; [ఎదుటకువచ్చి] ఇదేమి న్యాయము! ముందువచ్చిన వారెందుకును కొరగాకుండ బోయిరి. సమయమునకు వచ్చిన సవ్యసాచి చంక కెక్కినాడు.

శ్రీకృ: నీవు తలకే యెక్కుము నారదా! వలదందునా !

నార : పర్వతమునే కొనగోటిని త్రినవాడవు. నీకు నాబోటి యర్భకులు బరువా గోవర్ధన గిరిధారీ!

శ్రీకృ; అర్జునా! అలసి వచ్చితివి లోనికరుగుదము రమ్ము. [చేయపట్టుకొని అటుతిరిగి సంభ్రమాశ్చర్యములలో] ఎవరు? దుర్యోధన చక్రవర్తియా! ఇదికలకాదు గదా! కౌరవంశవర్ధనా! సకలైశ్వర్యనిర్జితాఖండలా! అఖండ భూమండలాధిప మండనా! మానధనా సుయోధనా నీవెప్పుడు వేంచేసితివయ్యా!

దుర్యో; నీవు నిద్రించుచుండగా వచ్చితినయ్యా!

శ్రీకృ; మరియింతసేపెచ్చట నుంటివి కౌరవేశ్వరా !

నార ; కనకపు సింహాసనమున గూర్చుండ బెట్టితిని.

శ్రీకృ; నేనటువైపు ముఖము బెట్టి పరుండుటవల్ల చూడలేదు.

నార : పోనిమ్ము పెడముఖము పెట్టుకున్న నదియేచాలు.

శ్రీకృ; నన్నెవరో నిద్రలేపితిరి. లేచినవెంటనే అర్జునుని చూచితిని.

నార ; కృష్ణా! లేచినవెంటనే చూచితివో - చూచినవెంటనే లేచితివోగాని-నిన్ను నిద్రలేపినది నేను.

శ్రీకృ; నీవెట్లన్నను-ముందుగా అర్జుననేకదా చూచితిని.

నార ; ఆమాటమాత్రము నిజమే ?

దుర్యో: ముందు వెనుకలభేదమేగాని అందర మొక్కటేకదా !

నార : పరమ సత్యము. వేదాంతసారమునే చెప్పితివి.

శ్రీకృ: నారదా! నిద్రలోనుండి కౌరవచక్రవర్తికి తగిన విధముగా స్వాగతము చెప్పలేకపోయితిని. మేలుకొన్న పిదపగూడ, చక్రవర్తిని చూచిన యానందముతో మనసెక్కడోనున్నది. నీవైన చెప్పితివా !

నార : నీమనసెక్కడో నున్నది. నామనసు నీపై నున్నది. నేనేమి చేయుదునయ్యా పరంధామా !

శ్రీకృ: రాజ రాజా! ఆలక్ష్యమునకు అన్యథా భావింపకుము. రమ్ము. లోనికరిగి ఆతిథ్యము గైకొందువుగాని.

దుర్యో: దారిలో ఛేదిపురమున అన్నియును ముగిసినవి.

శ్రీకృ: అవునుతే. నా యింట తిందువా ! నీ కేమియు గానివాడను.

నార : సుయోధనా ముందరి కాళ్ళకు పడుచున్నవయ్యా బంధములు నీ కేమియూ గానివాడట। ఔనన్నగాని విడువకు.

శ్రీకృ ; రారాజా! నిన్నుచూచిన ఆనందముతో మాటలు వచ్చుటలేదు.

నార : అనురాగము పైనపైచుకొని పోయినది.

శ్రీకృ : కర్ణ శకుని దుశ్శాసనులు - భీష్మ ద్రోణ కృపాశ్వత్థాములు-గాంధారీ ధృతరాష్ట్రులు క్షేమమే కదా!

దుర్యో : క్షేమమే కృష్ణా!

శ్రీకృ : అయ్యయ్యో! మాటల సందడిలో అడుగ మరచితిని. నీవచ్చినపని చెప్పి నన్ను ధన్యుని చేయుము.

దుర్యో : నీవు కౌరవ పాండవులకు సమానుడవేకదా.

శ్రీకృ : నేనందరకు సమానుడనే.

దుర్యో : కావున రాబోవు కురుపాండవ యుద్ధములో ముందుగా వచ్చి నాకు సహాయము చేయువలయును.

శ్రీకృ ; నీవు ముందువచ్చిన మాట నిజమే!

నార : అందులకు సాక్ష్యము నేను.

శ్రీకృ : కాని నేను ముందుగా అర్జునుని చూచితిని.

నార : అందులకు గూడ నేనే సాక్ష్యము.

శ్రీకృ : నా కిరువురును సమానులే। మీ కోరికలు తీర్చుటలో ముందు వెనుకల క్రమము పాటింతును. అర్జునుడుకూడ అందులకే వచ్చెనేమో! ఏమర్జునా!

అర్జు : ఆర్తత్రాణ పరాయణా ! మేము యుద్ధము కోరము చేయవలసి వచ్చినచో వెనుదీయము. సంధిచేసి యెల్ల రను గాపాడుమని ప్రార్థింప వచ్చితిని.

నార ; సాగనిమాట! కృష్ణా! నీవు మాకే సహాయము చేయ వలెను.

శ్రీకృ : ఇరువురు ఏక కాలమందే ఏక కార్యార్థమై వచ్చితిరి. గావున సహాయ మిరువురు సమానముగా పొందుట పాడి. నాసర్వశక్తులను రెండు భాగములుగా విభ జింతును. అందు మీ యిష్టము వచ్చినదానిని కోర వచ్చు. ఒక్క నియమము. మాత్రము పాటింప వల యును.

నార సుయోధనా! ఆ పన్నాగము కనిపెట్టుము.

శ్రీకృ : నేను ముందుగా అర్జునుని చూచుట చేతను-ఇరువురిలో అర్జునుడు చిన్నవాడు అస్వతంత్రుడు గావుట చేతను ముందుకోరు అవకాశము అర్జునునిది.

అర్జు : ధన్యుడను మహానుభావా.

దుర్యో : కృష్ణా! ఏమా రెండుభాగము ?

శ్రీకృ : నాచెంతనున్న పదివేలమంది యాదవ వీరులు- నారాయణాఖ్యులు కంచు రథములతో సహా ఒక భాగము.

నార ; దుర్యోధనా చాలునయ్యా ! ఇక దేవదేవుడే ఎదుట నిలిచినను ఆయుధము పట్టజాలడు.

దుర్యో ; రెండవ భాగమేమి కృష్ణా!

శ్రీకృ : నేనొక్కడను ఒక భాగము. యుద్ధము చేయను. బుద్ధికి తోచిన మాట సాయము మాత్రము చేతును.

నార : ఏమేమి ! పదివేలమంది మహావీరులు పరాత్పరునకు సమానమా! యుద్ధము చేయని లీలామానుష విగ్రహుడు అలంకారార్థము రథముమీద బొమ్మవలె బరువు చేటుగాక ప్రయోజన మేమిటయ్యా!

దుర్యో; మా గురుదేవులు బలరాములవారెందు!

నార : ఆయన తీర్థయాత్రల కరిగెనుగదా.

శ్రీకృ ; అన్నయ్య ఎవ్వరితోను చేరడు.

దుర్యో ; బలదేవుడే లేనిచో పదివేలమంది కాదుగదా - పది కోట్లమంది పాండవపక్షమైనను మాకు భయములేదు.

నార : అయిన మనకీ మాయలమారి కృష్ణుడు తప్పడా సుయోధనా! ఎంతదూరము వచ్చితివి! వ్యర్థమాయెనది.

అర్జు ; ఇక కోరుకోవచ్చునా బావా !

శ్రీకృ : అవశ్యము. నిస్సంకోచముగా వలసినది కైకొమ్ము.

అర్జు ; ఇదే నా దైవమును ధ్యానించి నా యిష్టమును ప్రకటింతును. [కన్నులుమూసి ధ్యానము చేయును]

నార : సుయోధనా! బలమునంతయు అర్జునుడు తన్నుకొని పోవును. పట్టిగొడ్డు తాకట్టువలె నీకినిర్గుణుడుతప్పడు.

అర్జు : ఆత్మలేని శరీరమువలె కృష్ణుడులేని పాండవులు తేజో రహితులు! పరంధామా! నీవే మా భాగము

నార : అంతే అర్జునా! ఇక మాట మార్చుటకు మేమంగీక రింపము. సుయోధనా! భళీ భళీ! పదివేలమంది మహా రథులు కంచురథములతో సహా నీ భాగమైరి. దీనితో నీ సైన్యము పదునొకండు అక్షౌహిణీల సంఖ్యకు పూర్తియైనది.

దుర్యో : అవును మునీంద్రా ! కృష్ణా ! నా భాగము నా యధీనము చేయుము.

శ్రీకృ ; వారు నీవారే! నీతో వాటే! నిశ్చింతగ నుండుము.

దుర్యో: అయిన నాకు సెలవు గోపాలా!

శ్రీకృ: కౌరవ చక్రవర్తికి హృదయపూర్వకమైన వీడ్కోలు.

దుర్యో : సెలవు మునీంద్రా! [బయటకు వెళ్ళిపోవును]

నార : [కృష్ణుని చేయిపట్టుకొని దూరముగా తీసికొనివెళ్ళి] ఏమయ్యా మహానుభావా! పదునెనిమిది అక్షౌహిణీల సంఖ్యకు పదివేలమంది తక్కువైతిరా యేమి కడకు నీవారినే పంపుచుంటివి.

శ్రీకృ: కాలచక్రమాగదు. శాపములు మానవు.

నార : అవునవును. యదువంశమున ముసలము పుట్టినదికదా వాలి శాపమాసన్న మగుచున్నది.

శ్రీకృ : జోస్యము చెప్పి నాగుండెలపై నిప్పు పెట్టకుము.

నార ; ఓహో! అవునుసుమా! (గట్టిగానవ్వును)

అర్జు : ఏమి మునీంద్రా అంత గట్టిగా నవ్వుచుంటిరి !

నార: నీ నగుబాటుపనికి నవ్వవలదా మరి! నవరత్ననిధులకై సముద్రమును తోడిపోసి కడకు నత్తగుల్లను పట్టు కొన్నట్లుగా చివరకి వాసుదేవునా కోరుకొంటివి ! ఇతడు స్థిరుడు కాడయ్యా, ఎవరెవతో పిలుచుచుందురు. ఎక్కడెక్కడికో పోవుచుండును సమయమునకు నీకు చేతికందునా ?

శ్రీకృ: అవునర్జునా! శూరులు రణరంగదోస్సారులు అగు పదివేలమంది మహారథులను కాదని ఆయుధముపట్టని నన్నేల కోరితివయ్యా !

అర్జు : మహాత్ములారా! నన్నిందులకిట్లు శపింౘెదరు! పది వేలు కాదు పది కోట్లమందియైన నీ యనుగ్రహమునకు సాటివత్తురా పరమాత్మా!

నార : ఆయుధము పట్టని పరమాత్మునిచే నేమి చేయింతు వయ్యా! గుఱ్ఱములు తోలింతువా యేమి !

అర్జు : నాకంతకన్న మహాభాగ్యముకలదా స్వామీ! పరం ధాముడు పార్థసారథి కాలవయుననియే నా వాంఛి తము సారథి పార్థునకుగాదు. కురుక్షేత్ర రణరంగ కార్యనిర్వహణకే సారథి.

శ్రీకృ; నారదా! నీవున్నచోట నుండవుకదా. లేనిపోని జ్ఞాప కములుచేసి నా తలమీదకు దెచ్చితివి. కర్ణునిముందు నా పాట్లేమగునో !

అర్జు ; చతుర్వేదముల సారము శౌరి సారథిగానుండ-జండాపై కపిరాజు కూర్చుండ - దేవదత్తము మ్రోగుచుండ - గాండీవ పాశుపతాస్త్రములు చేతినుండ భీష్మ ద్రోణ కృపాశ్వత్థామ కర్ణ దుర్యోధన దుశ్శాసన సౌబలాది సమస్త కౌరవ సేనను ఒంటరిగా జయించి నీదయకు పాత్రమైన నేను రథినైయుండ కర్ణుడు తలయెత్తి చూడగలడా మహాత్మా!

శ్రీకృ; నీ యాత్మ విశ్వాసమునకు మెచ్చితిని. నీకు జయమగుగాక !

నార : నీవన్న మాటపాయమప్పుడే ప్రారంభించితివే!

శ్రీకృ; వట్టి మాటమాత్రమేకదా నారదా !

నార : ఆమాట చాలదా సర్వమును చక్కబెట్టుటకు !

అర్జు ; అదే కరుణ నిరంతరము జూపుము కృష్ణా! నిన్ను రాయబారమునకు బంపుటకు మా అన్నదమ్ములు ద్రౌపదియు నిచ్చుటకు వచ్చుచున్నారు. నేను ముందుగా వచ్చితిని.

శ్రీకృ: రానిమ్ము. అంతదనుక నీవు విశ్రాంతి గైకొందువు గాని లోనికరుగుదము. రమ్ము నారదా!

[ముగ్గురులోనికి వెళ్ళుచుండగా తెరపడును]

—:o:—

# కౌరవ పాండవీయం

## అయిదవ రంగము

[తెరతీయుట నారదుడు పాడుచు వచ్చును]

నార ; మానవత్వమే వికసించిందా

దానవత్వమే నశియించిందా
నీ గాథలలో బోధనలు
నీ మాటలలో మర్మములు
మానవజాతికి మహాదర్శనములు ॥మా॥

ప్రజలను కాదని పరిపాలింప
పదవికి చెడునను సత్యముచూప
కొండకు పూజలు చేయించి
ఇంద్రుని గర్వము వణచితివి-వ్రే
పల్లెను స్వాతంత్రము చేసితివి ॥మా॥

జీవుల హింసింప చేయగ కాదని
గోవులగాచి చూపితివి
గురువులమీద భక్తి వలయునని
బడిలోచేరి చదివితివి - స్నే
హితుడు కుచేలుని బ్రోచితివి ॥మా॥

మానవులందరు ఒకటే జాతి
మనకేలా యీ భేదములని
సా[త్రాజితిని జాంబవతిని
సతులుగ నొకచో నేలితివి - బా
ణాసుర కూతును దెచ్చితివి ॥మా॥

[పాట పూర్తికాగానే నారదుడు వెళ్ళిపోవును. తెరలేచును. శ్రీకృష్ణుని మందిరము తగినన్ని ఆసనములు అందముగా నమర్చ బడి యుండును. ముందు ద్రౌపది వెనుక భీముడు లోపలనుంచి వత్తురు.]

[ద్రౌప; నాథా! మీ అన్న చేయు సంధి [ప్రయత్నములు వింటిరా!

భీము; వింటిని దేవీ! వింటిని.

[ద్రౌప; వినికూడ పట్టనట్లు కూర్చున్న అర్థమేమి?

భీము: మేము అన్నమాటకు జవదాటని వారముకదా.

[ద్రౌప: మరి నాడు కౌరవసభలో మీరన్న మాటలు!

భీము : అదియే బాధాకరముగా నున్నది.

[ద్రౌప: నా బాధ మీకర్థము కాకున్నది. మీ [ప్రతిజ్ఞ జ్ఞాపకము లేదా?

భీము : జ్ఞాపకము లేక కాదు - అన్నగారి అనుమతి లేక!

[ద్రౌప; అది యీ జన్మలో మనకు దొరకదు. కౌరవ్యనలు గురిముందు దారుణమైన పరాభవము పొందినను - పన్నెండు సంవత్సరము లరణ్యములో పడరాని యిడుములు పడినను అజ్ఞాతవాసములో దాసీవృత్తి చేసినను మీ అన్నకు చీమకుట్టినట్లులేదు. అదేమి శాంతమో!

భీము : ఆయన శాంతమునకు అంతము-అర్థము తెలియుట లేదు.

ద్రౌప: నాథా! నిజముగా నేను మీమీద నాసతో బ్రతుకు చున్నాను. లేకున్న నెప్పుడో అగ్ని ప్రవేశముచేసి యుందును. నా ప్రతినలు నా కోరికలు మీ మూల ముగా తీరవలయును.

భీము : నా యారాటము గూడ నదియే దేవీ!

ద్రౌప: ఈ వెండ్రుకలుపట్టి యీడ్చిన యా చేయి తునకలు గావలయును,

భీము ; నిన్ను చూచి తొడజూపిన రారాజు తొడలు విరుగ వలయును.

ద్రౌప: ఆశుభసమయ మెప్పుడు వచ్చునో ?

భీము ; మనకు కాలము వారికి కర్మము కలసిరావలయును.

ద్రౌప ; ఈలోగా మనకు ముసలితనము వచ్చును. యౌవన మంతయు నరణ్యములో గడిపితిమి వృద్ధాప్యములో రాజ్యభోగములు కలిగిననేమి ? కలుగకున్ననేమి ? వారు జీవితమంతయు భోగము లనుభవించిరి.

భీము : ఎప్పటికైనను నీకోరిక తప్పక తీర్తును!

ద్రౌప ; సౌగంధిక పుష్పము తెచ్చుటకే అంత కష్టపడితిరే! ఇంక దుర్యోధన దుశ్శాసనులను జంపుట కెంతపడు దురో!

భీము : ఎంతకష్టమైనను నాప్రతిన చెల్లించుకొందును.

ద్రౌప: నాకా నమ్మకము లేదు.

భీము : దేవీ! బక జరాసంధ కీచక హిడింబాసురులను సంహ రించిన నా పరాక్రమమునే శంకించుచుంటివా?

ద్రౌప : అందులో మీ ఘనత యేమున్నది? ఆకలితోనున్న బకుని అన్నము తిందువు రమ్మని కొట్టితిరి. జరా సంధుని కొట్టుటలో శ్రీకృష్ణుని తంత్రము సాయపడి నది. కీచకుని మోసగించి చంపితిరి. హిడింబాసురుని చంపుటలో మా సోదరి హిడింబి సాయపడినది.

భీము : దేవీ నన్ను కవ్వింపకుము.

ద్రౌప : కవ్వించినను నవ్విపోయినను మీరు చేయగలిగిన దేమున్నది!

భీము : పాంచాలీ! ఇప్పుడేపోయి ఆ కౌరవులను చీల్చిచెండా డెదను.

ద్రౌప: [అడ్డగించును] నాథా! నాథా! నిజముగా కోపము వచ్చినదా?

భీము : అవును. ఆడినమాట నెరవేర్చ లేనివాడు-ఆలి కోరిక తీర్చలేనివాడు అసమర్థుడు, అటువంటి హీనమైన బ్రతుకు బ్రతుకుట నాకిష్టములేదు. చంపుటయో చచ్చు టయో నేడే తేలవలయును. [విసురుగా వెళ్ళబోవును]

ద్రౌప : [చేయిపట్టి] ఆగండిస్వామీ! మీరు కోపమును మరచిపోతిరో జ్ఞాపకముంచుకొంటిరో చూతమని అట్లం టిని, మన్నింపుడు.

భీము : నేను కోపమును మరచుటయా? కోపము యొక్క రూపమే భీముడు.

ద్రౌప : నాకు తెలియదా? ప్రసన్నులుకండు. ఇది సమయము కాదు.

భీము : సమయా సమయములతో నాకు నిమిత్తములేదు. నా హృదయము ప్రతీకార వాంఛతో పలవరించుచున్నది. [ఆమెను నెట్టి వెళ్ళబోవును]

ద్రౌప : (కూర్చుండబడి ఉత్తరీయముపట్టి) ప్రియా-(పాడును) అలిగినా విడువనులే

చలము సపీవె తొలగిపోయినా ॥అ॥
[లేచి] నా కనుసన్నలు నీ పదబంధము
నా చిరు నవ్వులు నీయెద గంధము
నా గళరవములు మురళీ స్వరములు
ఇన్నిటి వీడి యెటుపోదువులే ॥అ॥

నీ యభిమానము నను బ్రతికించును
నీ బలదర్పము నను గెలిపించును
నీవగమగసిరి నను మురిపించును
నన్నిట వీడి యెటుపోదువులే ॥అ॥

భీము : దేవి! నీ గానసుధాపాతముతో నా కోపాగ్ని చల్లార్చిపోయినది.

ద్రౌప : నేను నమ్మను. కోపము చల్లారినదనుటకు గుర్తు ?

భీము ; నమ్ముటకు నన్నేమి చేయమందువు ?

ద్రౌప : నవ్వాడు.

భీము : [చిరునవ్వు నవ్వును]

ద్రౌప : ఊహూ! అది భీమసేనుని నవ్వుగాదు. భీమునకు అనుగ్రహము వచ్చినను పట్ట పగ్గములుండవుగదా! ఆ నవ్వేది?

[భీముడు గట్టిగా నవ్వును, ద్రౌపది కిలకిల నవ్వును అది విని భీముదు మరింతగా విరగబడి నవ్వును. ఇంతలో లోపలనుంచి శ్రీకృష్ణుడు నారదుడు ధర్మరాజు అర్జునుడు వత్తురు]

నార : ఏమయ్యా వృకోదరా! ప్రళయకాల పర్జన్య గర్జనవలె విన్నవారి గుండెలదరునట్లుగా నవ్వుచుంటివి - ఏమిటి కథ?

భీము : ఏమున్నది స్వామీ! ద్రౌపది నవ్వుమన్నది.

నార : అవునులే. నీ నవ్వు విని యెన్నాళ్ళయినదో! అరణ్యవాసములో నవ్వులాలేవు అజ్ఞాతవాసములో నవ్వుట కవకాశము లేదు. నేటికి కష్టములు గడిచి గట్టెక్కినారు. హాయిగా నవ్వుకొనండి.

ధర్మ : నవ్వులాటకిది సమయము కాదు. వాసుదేవుని రాయబారిగా కరిపురమునకు బంపవలెను. విషయము చర్చింపవలయును.

శ్రీకృ : దర్మనందనా సావధానులము. అందరును కూర్చుండుడు. అర్జునా నకుల సహదేవులింకను రాలేదా! [కూర్చుండును]

అర్జు : వారమ్మ చెంతకరగిరి. ఈలోగా మీరుమాట్లాడవచ్చు.

శ్రీకృ: సోదరీ! నీ యభిప్రాయము గూడ కావలయును. చెప్పుము బావా !

ధర్మ : యదునందనా రాయబారము జరిపి శాంతిని గాపాడుము. సంధిచేసి భరతవంశమును ప్రజలను రక్షింపుము.

భీము : అంధరాజు సంధికిష్టపడినను ఆ గర్వాంధుడు రాజరాజు పడనీయడు.

నార : నీవా దుర్యోధనుని మాత్రము మరువకుము.

ధర్మ : ఎవరేమన్నను మన ప్రయత్నము మనము చేయవలదా!

శ్రీకృ: వారిష్టపడరని తెలిసియు సంధియనుట నేరము వారిపై రుద్దుటయే!

భీము : అదే నిజమైన నింక లేనిదేమున్నది! మదీయచండతర గదాదండముతో కౌరవ వక్షఃకవాటములు బ్రద్దలు కొట్టనా !

శ్రీకృ; శాంతించుమయ్యా భీమసేనా !

భీము ; శాంతిపక చేయున దేమున్నది! నీ వరుగుచుంటివిక దా సంప్రదింపులకు:

నార : ఇంతకు రాయబార మేమని ధర్మరాజా !

ధర్మ : రెండవసారి జూదములోని నియమముల ప్రకారము మే మరణ్యాజ్ఞాత వాసములు విజయవంతముగా ముగించితిమి గావున మా అర్థరాజ్యము మాకీయ వలయును, అందులకే రాయబారము,

శ్రీకృ: అందులకు వారంగీకరింపనిచో ?

ధర్మ : అర్థరాజ్యముగాకున్న అయిదూళ్ళయిన యిమ్మనుము.

నార : గ్రామమున కొకరుచొప్పున భిక్షాటనకా? ధర్మరాజునకు పాతయులవాటింకను పోలేదు కృష్ణా!

భీము : ఛీ! ఛీ! భండన పండితులైన పాండునందనులకు ముష్టి పెట్టినట్లుగా అయిదూళ్ళు దానము కావలయునా! ఇంతకును కారణమా దుష్టదుర్యోధనుడు. యమ దోర్దండ సన్నిభమదీయ గధాదండముతో వాని శిరము ముక్కలు చేయుదును. [గధ నెత్తును]

నార : దుర్యోధను డిచ్చుట లేదయ్యా! నీ గధదించుము. చేతగానివారు చాటుననే గట్టిగా మాట్లాడుదురు.

భీము : అవును మునీంద్రా! యదార్థమునే పలికితిరి ?

నార : నే నబద్ధము లాడనయ్యా!

భీము : చేతగాని వారము గాకున్న భార్యను పదిమందిలో పరాభవింప జూచుచు నూరకొందుమా ? మా చేత గాని తనమున కంతకన్న నిదర్శన మేమి కావలెను.

ధర్మ : శాంతింపుము నాయనా.

నార : శాంతమే భూషణము.

భీము : సిగ్గు విడిచినచో శాంతమే భూషణము. [గధను పడ వైచును.]

అర్జు : అన్నా గధను పడవైతువేల ? తీసికొమ్ము. [ఇవ్వ బోవును]

భీష్ము : వలదు, వలదు. శాంతమునకు దానికి పరమవైరము.

శ్రీకృ: వారికై దూళ్లు ఇవ్వనిచో నేమని చెప్పమందువు !

ధర్మ : నలుగురు తమ్ములకు నాలుగూళ్ళయినా ఇమ్మనుము.

శ్రీకృ: ఏవా నాలుగూళ్ళు !

ధర్మ : ఇంద్రప్రస్థము-యమప్రస్థము-ఆవంతి-వారణావతి!

నార : ఇచ్చినచో అయిదవది హస్తినాపురము అవునా !

ధర్మ : అవును మునీంద్రా!

నార : ఓహో! కౌరవ సామ్రాజ్యమునకు నాలుగుదిక్కుల నున్న నాలుగు దుర్గములు తమ్ములకు మధ్యనున్న హస్తినాపురము నీకు కావలయునన్నమాట! అవి ఇచ్చినచో సామ్రాజ్యమే ఇచ్చినట్లుకదా.

శ్రీకృ: [నవ్వి] మా బావ ధర్మజుడు మెత్తని పులి నారదా!

నార : ద్రుపద పురోహితునకు వారుచెప్పిన సమాధానమేమి!

ధర్మ ; వాడి సూదిమొన మోపినంత నేలకూడ ఇవ్వము చేతనైనచో యుద్ధముచేసి తీసికొనుడు అని చెప్పిరట!

నార: నిజమే! యుద్ధము చేసినచో పూర్తి రాజ్యమే వచ్చును. కాని యుద్ధమునకు భయపడి సంప్రదింపులు జరుపుచుంటిరికదా.

శ్రీకృ: ఫాలాక్షుని గెలిచి పాశుపతాస్త్రమును గొన్న వల్గుణుడు - బక జరాసధ కీచక హిడింబాసురులను చంపిన భీమసేనుడు, దిక్కులను జయించిన నకులసహ

దేవులు తమ్ములుగాగల ధర్మరాజు యుద్ధమునకు యయుపడుటరా !

భీము ; కృష్ణా! యుద్ధము యుద్ధముని సంధి చెడగొట్టకుము.

శ్రీకృ: [నవ్వి] భీమసేనా! నీవేనా యీ మాటలన్నది !

నార : నవ్వుచు] అసలు నీవు భీముడవేనా అని !

శ్రీకృ: ఏమిటీ మార్పు! సూర్యచంద్రులు గతులు తప్పిరా!

నార : లేదు లేదు భీముని మతి తప్పినది.

భీము ; నారదమునీంద్రా నాకు మతితప్పినదా !

శ్రీకృ: కురుపతి పెందొడలు విరుగగొట్టెద - దుశ్శాసను రొమ్ము పగిల్చి వెచ్చనెత్తురు కడుపారగ్రోలి పాంచాలి కురులు కడిగి ముడివైచెద - అని ప్రగల్భము లాడితివి కదయ్యా నాడు కొల్వులో! ఇప్పుడీ పిరికి మాట లేల నయ్యా భోజనప్రియా !

భీము : వాసుదేవా! నేను పిరికివాడనా !

నార : భోజన పరాక్రమేగాని పోరాటపరాక్రమము లేనివారు భుజశౌర్యమునకు బదులు వాచశౌర్యమునే ప్రకటింతురు.

అర్జు : మహాశయులారా! భీముగ జేంద్రము నేల రెచ్చగొట్టెదరు !

భీము : ఒక్కరును నా అంతర్యమును గ్రహింపరైరి.

నార ; లాభము లేదయ్యా పాండవదూతా! ఎంతకో అంతకు సంధి చేయుటయే మంచిది. అర్ధగ్రామ మిచ్చినను

అంగీకరించి రమ్ము. భీముడు యుద్ధమునకు బెదురు చున్నాడు.

భీమ : [హుంకరించుచు లేచి] మునీంద్రా ! నేను బెదురు చున్నానా ?

ధర్మ : శాంతింపుము భీమసేనా!

భీము : అంత మాటపడి యింకను శాంతించుటయా ? కయ్యములు పెట్టు నీ జగడాల దయ్యము బెదరిన బెదరును గాక-వెన్నను దొంగిలించి గోపకాంతలచే కవ్వపు రాట్లకు గట్టివేయుబడిన యీ యాభీరుడు బెదరిన బెదరునుగాక-భీముడా యుద్ధమునకు బెదురుట! అర్జునా ఆగధ నిటు తెమ్ము. [గధ నందుకొనును]

నార : కృష్ణా! శరణు శరణు!

శ్రీకృ: ఉన్న మాటన్న నంత ఉలుకేలనయ్యా!

నార : శపథములు మరిచి సంధియనుట జంకుట కాదా ?

భీము : పాండవులన్న మాటకు జవదాటరని యెరుగరా ?

శ్రీకృ : మరి దుర్యోధన దుశ్శాసనులకు చంపెదనని నీవన లేదా ?

భీము : అవును, అంటిని.

నార : అప్పుడట్లు-ఇప్పుడిట్లు అనుట జంకుట కాదా!

భీము : తంబురమీటు తంత్రాలమారికి - మాటలు దాటు మాటకారికి అన్నమాటలన్న అర్థమే కాదా ! అన్న మాట అనగా అగ్రజునానతి.

శ్రీకృ : అయిన పాండవు లగ్రజు నానతి దాటుట గాని- తా మాడినమాట జవదాటుదురన్న మాట !

భీము : అసంభవము కృష్ణా! నీవరిగిన యుగుగుదువు గాక. వారు మెత్తురుగాక - భాగమిత్తురుగాక, నా ప్రతిజ్ఞాపాల నకై ఆ దుర్యోధన దుశ్శాసనులను సంహారింపక మానను?

నార : మరియొక ప్రతిజ్ఞా? వలదు వలదు.

శ్రీకృ ; అవును మొదటి మ్రొక్కే యికను తీరలేదు.

భీము : గోపబాలురతో కోతికొమ్మంచులు గొల్ల భామలతో గుజ్జనగూళ్ళు నాడుకొను నీకేమి తెలియునయ్యా ప్రతిజ్ఞాపాలనము? గయుని విషయములో నీ ప్రతిజ్ఞ నేమి చేసితివి?

నార : అవునయ్యా భీమసేనా ? అటులనుగుడు.

భీము : నేనట యుద్ధమునకు బెదురుచున్నానట ! గధ పట్టు కొనుటయైన తెలియునా యీ గదాధరునకు ?

నార ; అవునయ్యా! పేరు పెట్టుకొనగానే సరిపోయినదా ?

ధర్మ ; భీమసేనా ! మనకల్పతరువునా నిందించుచుంటివి?

అర్జు ; అన్నా! పరంధామునా పరిహాసించుచుంటివి ?

ద్రౌప ; ఆర్యపుత్రా! మొరటుగా ప్రవర్తింపకుడు.

భీము ; ఛీ! ఛీ! చివరకు స్త్రీ చేతగూడ మాటపడి సిగ్గుమాలి బ్రతుకుచున్నాను. [గదనెత్తి] ఓ చండప్రచండ గదా దండమా ! ఆలినిబట్టి శత్రువులు బట్టలు విప్ప

చున్నను చూచుచు నూరకున్న యీ అపాత్రుని హాస్తముల నుండుటకు నీకుకూడ కళంకము ఈ పనికి మాలిని శాంతము నీకును సరిపడదు. నాతల ప్రయ్యలు చేసి నా రక్తములో నీ కళంకము కడిగి కొనుము. [తలపై కొట్టుకొన బోవును]

నార ; [పట్టుకొని] ఆగవయ్యా భీమసేనా!

భీము : నన్ను విడువుడు మునీంద్రా! ధర్మజుడు యుద్ధము చేయనీయడు. మాట నిలుపుకొనకున్నచో మీరు ముల్లోకముల చాటింతురు.

నార ; నానోట మాట దాగదయ్యా.

భీము : కావుననే నన్ను విడువుడు. నడిపడుటకన్న చచ్చుట మేలు.

నార : కృష్ణా! అర్జునా! రండయ్యా! పట్టుకొనుడు. ఈ గధ పదిబారువుల బరువున్నది. మోయలేకున్నాను.

ధర్మ ; నాయనా భీమసేనా అన్నికష్టములకు కారణ భూతుడను నేను. శిక్ష నేననుభవింప వలెను. ఆ గధ నిటు తెమ్ము.

నార ; ఇదిగో తీసికొమ్ము. (అందించుచుండును)

అర్జు : కృష్ణా! చినుకు చినుకు గాలివాన చేసితివే!

ద్రౌప ; అన్నా! ఆర్యపుత్రుని వారింపుము.

ధర్మ : సంధి జరిగినను జరగకున్నను నాకనవసరము. నేను న్నంతవరకెవ్వారికి సుఖశాంతు లుండవు. ఇన్ని యిక్క

ట్లకు కారణము నేను గావున ఈ గదతో నా తల వ్రయ్యలు చేసికొందును. [కొట్టుకొనబోవును]

శ్రీకృ: (పట్టుకొని) ధర్మజా! నీకుకూడ మతిభ్రమణము కలిగినదా? (గద తీసికొని) లోనికి వెళ్ళి విశ్రాంతి గైకొనుము.

ధర్మ : (విసురుగా లోనికి వెళ్ళును)

శ్రీకృ: వృకోదరా! నీకేలనయ్యా యీ తొందరపాటు? నీవే లేకున్న నిక కౌరవ చతురంగ సేనామహాటవిని కార్చిచ్చువలె దహించు వారెవరయ్యా!

నార : భీమసేనా! మరచితివయ్యా కౌరవులు చేసిన ద్రోహములు!

శ్రీకృ; పౌరుషము గలవాడెవ్వడైన మరచునటయ్యా?

నార : నిద్రపోతున్న నిన్ను త్రాళ్ళతో గట్టి గంగలో త్రోయలేదా!

శ్రీకృ: అందులకు వారి స్త్రీల పసుపుకుంకుములు గంగలో కలుపవలదా?

నార : నీ అన్నమునందు విషము కలుపలేదా వారు?

శ్రీకృ; అందులకు వారి ముక్కల రక్తము పిండవలదా?

నార : మిమ్ము లక్కయింట బెట్టి నిప్పుపెట్టలేదా వారు!

శ్రీకృ: అందులకు వారి గుండెలలో నిప్పుమండింపవలదా!

భీము : అవును అన్నియును నిక్కముగా చేయవలసినవే!

శ్రీకృ : అయినచో నిదిగో యీ గద తీసికొనుము.

నార : తీసికొని ప్రస్తుతము నీ భుజముననే వైచుకొనుము.

భీము : [గధ తీసికొని] నాప్రియమైన గధాదండమా తొందర పడకుము. అనతి కాలములోనే నీ రక్తదాహము తీర్తును. (భుజమున పై ఉంచుకొనును)

శ్రీకృ: కౌరవసభలో నీమాటలుగా నేమని చెప్పవలయును?

భీము ; ఓరీ కౌరవహంతకులారా! అన్నమాటకు కట్టుబడి మా అర్ధరాజ్యము మాకిండు. లేదా ప్రళయ భీకర యమదోర్ధండసన్నిభ చండ ప్రచండ గధాదండముతో మీ తలలను బొంగరములవలె చెండాడెదను. అని నామాటలుగా చెప్పుము

శ్రీకృ ; లోనికి వెళ్ళుము. మృష్టాన్నము సిద్ధముగా నున్నది.

భీము : [లోనికి వెళ్ళుచుండును]

నార : భీమసేనా! మా భోజనములు కాలేదు. ఆ మాట మరువకుము.

శ్రీకృ : సోదరీ నీ యభిప్రాయమేమి!

ద్రౌప: అన్నా సంధి ప్రయత్నము నాకిష్టములేదు. చేత నైనచో యుద్ధముచేసి సర్వమును తీసికొనవలయును. లేదా అన్నియును విడిచి అరణ్యమునకు పోవలయును. ఇనాడు కౌరవ సభలో ప్రతినలు పలికిన మగరాయుళ్లు నగ మాడువారై సంధికి సంబరపడుట సిగ్గుచేటు, నాకు సమ్మతము కాదు,

నార : అర్జునా వినుచుంటివా !

అర్జు ; దేవీ! శాంతము వహించుము

ద్రౌప ; శాంతముగాక చేయునదేమున్నది? సగమాడుదియైన సవ్యసాచి మరల మగవాడుగా మారి యేమి ప్రయోజనము! పెనుగధ భుజమున వైచుకొని తిరుగు వాయునందనుని లావును- గాండీవము చేతబట్టి యూరేగు విజయుని పరాక్రమము ఇంకెందులకు కాల్పనా !

అర్జు : పాంచాలీ! తొందరపడకుము.

ద్రౌప ; హు! తొందర, పదమూడు సంవత్సరముల నుంచి సహించుచున్నను నా సహనమున కంతము లేదా! ప్రతినలు చేసిన పెద్దలు అపని తమకు చేతగానిచో మూలన గూర్చుండవచ్చును. ఉపపాండవులు అభిమన్యు ఘటోత్కచ కుమారులే సర్వమును నిర్వహింపగలరు.

అర్జు ; దేవీ ఆవేశములో విచక్షణారహితవు గాకుము.

ద్రౌప ; ఎవరికి చచ్చినను నాకు మాత్రమింకను ఆవేశము చావలేదు. అవమాన పరితాపాగ్నితో నా హృదయము దహించుకొని పోవుచున్నది. నా సహనము సన్నగిల్లినది. అన్నా! భారమంతయు నీది. నాపగ చల్లారవలె. నా అవమానమునకు బదులు చేయవలె !

శ్రీకృ; మంచిది అర్జునా! నీవే మంచువు !

అర్జు : కర్ణుని బలముచూచికొని యుద్ధమున కువ్విళ్ళూరినచో రణరంగమున కర్ణుని ఖండ ఖండములుగా ఖండింతు ననుము.

శ్రీకృ: మీ ధర్మ నిరతిని శాంతి ప్రియత్వమును చాటుటకు లాంఛనముగా రాయబారము జరుపవలెను. లేనిచో నితర రాజులు మీకు సాయపడరు. ప్రజలకు మీపై సానుభూతి కలుగదు. కావుననే నేను హస్తినకుబోయి రావలెను. నారదా నీవుకూడా రమ్ము.

నార : నీమాట దాటగలనా దేవా!

శ్రీకృ: మీరీ రుక్మిణీగృహమున విందారగించి సిద్ధముగ నుండుడు. నేను సత్యభామా మందిరమునకేగి వచ్చి నకుల సహదేవుల అభిప్రాయములు విని అటుపై గజపురమున కేగుదము.

నార : సత్యభామాదేవి అనుమతి పొందవలయునా!

శ్రీకృ ; లేనిచో మరల బొప్పికట్టింతువు.

నార : హరి హరి! శృంగార రస సామ్రాజ్య పట్టభద్రుడవైన నీ గారడీకి నేనా కారణము! పన్నాగమూ నీది. పని నాదు.

శ్రీకృ : మంచిది రండు. లోని కరుగుదము.
(అందరులోనికి వెళ్ళుచుండగా తెరపడును.)

—:o:—

# కౌరవ పాండవీయం

## ఆరవ రంగము

[తెరబయుట నారదుడు పాడుచు వచ్చును.]

నార ; రమారమణా! దయాభరణా!
సురాధిప సేవితచరణా! ॥రమా॥

పదవులకై పోరాటం
పెదవులకై ఆరాటం
బాగుపడదోకో యీ లోకం
మూగ ప్రజలకేనా శోకం ॥రమా॥

ప్రతిచోటా ఉపన్యాసం
ప్రతిమాటా దగా మోసం
పంచిపెడుదురా భూభాగం
వంచితులకేనా యీభోగం ॥రమా॥

కొంగలకా సందేశం
దొంగలదే యీ దేశం
వినరు మహాత్మా నీమాట
జనుల మెప్పుకే నీ పాట ॥రమా॥

(పాట పూర్తికాగానే నారదుడు వెళ్ళిపోవును. వెంటనే తెరలేచును. అది దుర్యోధనుని విలాస క్రీడామందిరము. కర్ణ దుర్యోధనులు చదరంగ మాడుచున్నారు. నర్తకి నాట్యము చేయుచున్నది.

నృత్యగీతం:

సరిసరి అందాలు
గమనించినా చాలు
పదములదరి బా
నిసలగుదురు నాకు ॥సరి॥

భూజనముల నెలరాజగుగాక
స్త్రీజనముల వలరాజగుగాక
సొగసరి నలకూబరుడేయైన
మగసిరిగల శ్రీవరుడేయైన ॥సరి॥

వయసు పొంగుల వన్నెల జంటలు
సొగసురంగుల కన్నుల పంటలు
మరపురాని తొలి వయసు వరాలు
తిరుగులేని సుమశరుని శరాలు ॥సరి॥

శకు ; (తొందరగా బయటనుంచివచ్చి) నర్తకీ నీవుపొమ్ము. (ఆమె వెళ్ళగానే) రాజరాజా! శ్రీకృష్ణుడు పాండవ దూతయై సంధి సంప్రదింపులకు వచ్చినాడట. విదురు నింట విందారగించుచున్నాడు. త్వరలో కురువృద్ధులను చూడవచ్చును!

కర్ణు : పెద్దలు సంధిచేయమని మనల బాధింతురు.

శకు : సంధి చేసినచో నిక మన సంబర మేమున్నది!

కర్ణు : అందులకే కృష్ణుడు పెద్దలను కలిసికొనకుండ చేయవలెను.

దుర్యో: అవునుమామా! కృష్ణుని ఇక్కడకే తీసికొనిరమ్ము. ఇటకు పెద్దలు రారు. అతడు మంచిగ మాట్లాడినచో గౌరవముగ చెప్పి పంపుదము. లేదా యిచ్చటనే బంధించి వైతము.

శకు : అవును. అటులే చేయుదము. [బయటకు వెళ్ళును]

దుర్యో; కర్ణా! రాయబారమేమని యందువు!

కర్ణు : రెండవసారి జూదములోని నిర్ణయము ప్రకారము అరణ్యాజ్ఞాతవాసములు విజయవంతముగా ముగించితిమికదా. నాటిమాట ప్రకారము అర్థరాజ్యమిండు అనేమో?

దుర్యో; అర్థరాజ్యము కాదుకదా అర్థగ్రామమైనను లేదు.

కర్ణు ; ఇచ్చుటయు మానుటయు తరువాత. అంతకన్న ముఖ్య విషయము మరియొకటున్నది.

దుర్యో ; ఏమిటది రాధేయా!

కర్ణు : ఉత్తర గోగ్రహణము జరిగిన సాయంకాలము-అనగా సూర్యాస్తమయంతోగాని అజ్ఞాతవాస సంవత్సరము పూర్తికాదు. మనము మధ్యాహ్నమే అర్జునుని గుర్తించితిమి నియమము ప్రకారము అజ్ఞాతవాసము భంగమైనట్లే. కావున వారు తిరిగి అరణ్యాజ్ఞాతవాసములు చేయవలయును. అంతవరకు సంధి ప్రసక్తిలేదు.

దుర్యో: లెస్స! రాధేయా! లెస్సగా చెప్పితివి.

(ముందు శకుని తరువాత శ్రీకృష్ణుడు అశ్వత్థామ దుశ్శాసనుడు లోనికి వత్తురు)

దుర్యో: స్వాగతము, పాండవదూతకు సుస్వాగతము.

శ్రీకృ: సంతోషము సుయోధనా.

దుర్యో : కృష్ణా ! ఆ సుఖాసన మలంకరింపుము. నారద మునీంద్రా సుఖాసీనులుకండు. అందరును కూర్చుండుడు. మామా యదునందనుడెట్లును మనయింట విందులారగింపడుకదా. తదుపరి కార్యక్రమము ?

శకు : రాజలాంఛనములతో స్వాగతము చెప్పితిమి. తదుపరి అతిథిపూజ గావించుట మన భారత సాంప్రదాయము (చప్పట్లు కొట్టును నర్తకి వచ్చును) రాజనర్తకీ శ్రీకృష్ణునకు అతిథిపూజా సన్మానమును గావింపుము.

(నర్తకి పాటలోని భావమునకు తగినట్లుగా చేయుచు పాడుచు నాట్యము చేయును)

నృత్యగీతము :-

శ్రీ మానసాకాశ
రాకా సుధాకరా !
నాకు నీపై నాశ
నన్నేలుకోరా ॥శ్రీ॥

నా కన్నులను రాలు ఆనందభాష్పాలు
నీ చరణకమలాలు కడుగ సేదను దేలు
నా వలపు సుమమాల నీ కంఠమున వ్రేల

నా నోములే పండురా - గుండెలో
భక్తి భావమె నిండురా ॥శ్రీ॥

నల్లనీ నీ మేను కనుగందిపోయె
తెల్లనీ నీ కనులు ఎరుపాయెనోయి
చందన ఘనసార చర్చసేతును సామి
తాపమ్ము శమియింపరా - నా భక్తి
గంధమునే అలదుకోరా ॥శ్రీ॥

నా ప్రేమపూజలే కానుకలై నినుసాకు
నా హృదయ నవనీత మందుకో నీచేత
నీపై విరాళినే కర్పూర కళికగా
హారతిని వెలిగింతురా - మదిలోన
కోటి కాంతులు నింపరా ॥శ్రీ॥

శ్రీకృ; (మెడలోని హారమును తీసి నర్తకిపైకి విసరి ఆమె వెళ్ళగానే) సార్వభౌమ సామంతరాజ బంధు మిత్ర మునివరు లందరకు ప్రణామములు సుయోధనా! నీ తండ్రి యెట్లును నీ మాట కాదనడు. కావుననే ముందుగా నీదగ్గరకు వచ్చితిని. పాండవ దూతనై సంధిచేయమని అడుగుచుంటిని. పాండవుల కోరిక మన్నించి భరత ఖండమును భరత వంశమును గాపాడుము. సంధి యొనర్చిన యెల్లరుకు సుఖముండును.

కర్ణ; అజ్ఞాతవాస సంవత్సరము పూర్తి కాకుండ పాండవులు బయట పడినచో వారు తిరిగి అరణ్యాజ్ఞాతవాసములు

సలుపవలెను. ఉత్తరగోగ్రహణమునాడు అర్జునుడు బయలుపడు సమయమునకింకను అజ్ఞాతవాస సంవత్సరము పూర్తికాలేదు ఆనాటి సూర్యాస్తమయమగు వరకు వ్యవధి యున్నది

శ్రీకృ; లేదు కర్ణా! వ్యవధి లేదు. మీరు సూర్యోదయ సూర్యాస్తమయములనే లెక్కించితిరిగాని యేవ్యమైన తిధులను గమనించలేదు. భారత సాంప్రదాయ సిద్ధమైన ఖగోళ శాస్త్రము ప్రకారము ఉత్తర గోగ్రహణము నాటి ముందుదినముననే అజ్ఞాతవాస సంవత్సరము పూర్తియైనది సాంప్రదాయమును పాటించి పాండవుల కోరిక మన్నించుట న్యాయము.

దుర్యో: ఏమా పాండవుల కోరిక !

నార ; కోరుట కేమికష్టము! ఇచ్చువారున్న సామ్రాజ్యమే కోరవచ్చు.

శ్రీకృ: సామ్రాజ్య మక్కరలేదు. అర్ధరాజ్యము చాలును. ధర్మరాజునకు ఇంద్రప్రస్థమునిచ్చి యారాజ్య పట్టాభిషేకము చేసియున్నారు కదా! అదియే ఇమ్మనుచున్నారు.

దుశ్శా: వారా రాజ్యమును రెండవసారి జూదములో నోడిరి.

అశ్వ : అరణ్యాజ్ఞాతవాసములు పూర్తి చేసి తిరిగి వచ్చినచో ఆ రాజ్యము నిచ్చివేయుటకే గదా ఆ నాటి నిర్ణయము ! మాట మార్చుట అధర్మము.

కర్ణు : ధర్మము కాలానుగుణమైనది. రాజత్వము దైవదత్తము రాజు పాటించునదే ధర్మము - రాజు శాసించునదే ధర్మము.

దుర్యో: ధర్మాధర్మ నిర్ణయము తర్వాత చూతము. ఇది కుటుంబ కలహమనీ ఆస్తిపంపకమనీ తేలికగా చూడ వలసిన సమస్య కాదు. సాంప్రదాయమునకు రూప కల్పన చేయవలసిన ముఖ్యాంశము.

శ్రీకృ: ఏమిటా సాంప్రదాయము సుయోధనా ?

దుర్యో: ఏకచ్ఛత్రాధిపత్యమే భరత వర్షమునకు సాంప్ర దాయము. ధర్మరాజునకు యౌవరాజ్య పట్టాభిషేకము చేయునపుడు ధృతరాష్ట్ర మహారాజు నాతో సంప్ర దించలేదు. అది సాంప్రదాయ విరుద్ధము యుక్త వయస్కులైన జ్యేష్ఠ తనయులతో సంప్రదించకుండ రాజేమి చేసినను చెల్లదు.

శకు : ఈ రాజ్యము ధృతరాష్ట్రుని స్వార్జితము కాదు. కావున తన యిష్టప్రకారముగా వ్యవహరింప జాలడు.

అశ్వ : సార్వభౌమా! నీమేలుఁగోరి నేను చెప్పునది వినుము. మీ వంశమున తరతరాల నుంచియు అధికారము చిన్నవాని సంతతికే దక్కుచున్నది. అట్టి ప్రమాదము రాకుండ సంధిచేసి సుఖించుట లెస్స.

శకు : ప్రియతమనీ విలాసమునకై చిరకాలము యౌవన మనుభవించినయయాతి - పల్లెపడుచు చూపులవలలో

చిత్రాంగదుడు-పుట్టంధుడైన ధృతరాష్ట్రుడు వారి వారి హృదయ దౌర్బల్యములకు అసమర్థతకు నిదర్శనముగా అధికారము చిన్నవారి కొప్పగించిరి. అంతమాత్రమున నది శాస్త్రముకాబోదు - సర్వజన సమ్మతము కానేరదు.

కర్ణు : సర్వలక్షణ సంశోభితుడై సమర్థుడైన సుయోధనుడు రాజునకు జ్యేష్ఠుడై యుండగా మరియొకరికి రాజ్య పాలనాధికారమిచ్చు అవసరముగానీ అవకాశముగానీ లేదు. రాజ్యము అవిభక్తము, ఆత్మహానియు శత్రు వృద్ధియు నంగీకరించు మానవు డెవడుండును.

నార; మానవుడే అంగీకరింపకున్న మానధనుడైన సుయోధను డంగీకరించునా? ఏమయ్యా భానుమతీ ప్రాణనాథ !

దుర్యో ; ఎన్నటికీ అంగీకరింపము. రాజ్యము వీరభోజ్యము

దుశ్శా : గ్రీష్మాదిత్య పటుప్రతాప బల సంపన్నుడైన అగ్రజుడే చక్రవర్తి.

కర్ణు ; చక్రవర్తి వాదమే సత్యము. దానికి పరపక్షము లేదు.

అశ్వ : కర్ణా! మెరమెచ్చులతో రాజును పెడదారి బట్టించుట యుక్తముకాదు.

కర్ణు : తిన్నయింటి వాసములు లెక్కించుట యుక్తమా అశ్వత్థామా!

అశ్వ ; శ్రీకృష్ణునంతటివాడు వచ్చినందులకైన సంధిచేయుట లెస్స.

దుశ్శా ; ఎవడో ఒకడు వచ్చి ఏదో చెప్పినదియెల్ల చేయ వలయునా!

అశ్వ ; దుశ్శాసనా! ఘటనా ఘటన సమర్థుడైన శ్రీకృష్ణ పరమాత్మునా తూలనాడు చుంటివి! అతడవతార పురుషుడు. ఆది మధ్యాంత రహితుడు-అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుడు.

దుశ్శా : అప్రస్తుతము. అతడొకదూత. శత్రుపక్షమునుండి మనల నర్థింపవచ్చినవాడు. నలుగురిలో శత్రువును స్తుతించుట తక్కినవారిని నిందించుటయే యగును.

కర్ణ ; సభా మర్యాదలు తెలియని భోజన ప్రియులకు-మాటలు తప్ప చేతలులేని వాచాశూరులకు ప్రవేశమిచ్చుట సభకే అమర్యాద.

అశ్వ; కులహీనుని చెంత గూర్చుండబెట్టుకొనుట మర్యాదా!

దుర్యో : ద్రోణనందనా! కులమనగా నెట్టిది? ఎట్లువచ్చినది! తొలుతలో డంబము ఆలంబముగల వర్గమువారు తమ స్వార్థముకొరకు చేసిన విభాగములుకావా యీవర్ణ భేదములు. యీ రాతనిని కులహీనుని చేసినట్లుగనే నేనాతనికి అంగరాజ్యమిచ్చి రాజును చేసితిని. కర్ణుడు నా చెలికాడుగనేకాదు - కౌరవ సామ్రాజ్యమునకు సామంతరాజుకూడ సభాప్రవేశమున కర్హుడు. దానిని ప్రశ్నించు నధికారమెవ్వరికిని లేదు

అశ్వ : సార్వభౌమా! పాండవులు సంధికై శాంతి రాయబార మంపనీవు సమరమునకు కాలుదువ్విన లోకము నిందిం చునయ్యా!

కర్ణు : ఇవియా శాంతి రాయబారములు! అవమానముగా అర్ధ రాజ్య మిచ్చెదవా లేక యుద్ధమునకు వచ్చెదవా అనుట శాంతి రాయబారమా! శాంతియని నెట్టిదో నీ వెరుగుదువా?

అశ్వ : బలవంతులతో విరోధము మంచిదికాదు.

కర్ణు ; ఎవరా బలవంతులు ? పదిమందిలో భార్యనుపట్టి బట్ట లూడలాగినను చేతకాని దద్దమ్మలై చూచుచు నూరు కొన్న ఆ పౌరుషహీనులా బలవంతులు! కృష్ణుని మాయాబలముతో బ్రతుకుచున్న ఆదుర్బలులా బల వంతులు! అంత బలవంతులే అయినచో యుద్ధముచేసి పూర్తి రాజ్యమునే తీసికొనవచ్చునే! అర్ధ రాజ్యమున కేల అంగలార్చెదరు?

నార ; యదార్థముకర్ణా! సత్యమును వక్కాణించితివి!

శ్రీకృ ; సుయోధనా ! అర్ధరాజ్యమిచ్చుటకు మీ రంగీక రించుట లేదని తేలుచున్నది. ప్రత్యామ్నాయముగా ధర్మరాజు చెప్పినమాటలాలకింపుము.

దుర్యో : ఏమిటా సందేశము!

శ్రీకృ : అర్ధ రాజ్యము కాకున్న అయిదూళ్ళయిన ఇమ్మని నాడు.

అశ్వ : చిన్న కోరిక. అంగీకరించరాదా రాజరాజా !

నార : గ్రామ దాన సిద్ధాంతమునకు ప్రారంభోత్సవము చేతురా?

శకు ; ఏవా అయిదు గ్రామములు పాండవరాయబారీ ?

శ్రీకృ ; ఇంద్రప్రస్థము-యమప్రస్థము - అవంతి - వారణాసి హస్తినాపురము.

శకు : ఓహో! కౌరవ సామ్రాజ్యమునకు కీలక స్థానములై సైనిక స్థావరములగు నాయువు పట్టులు కావలయునా అవి ఇచ్చినచో కౌరవ సామ్రాజ్యమే యిచ్చినట్లుకదా.

కర్ణ ; అశ్వత్థామా! వింటివా పాండవుల చిన్నకోరిక.

శ్రీకృ: చివరి మాటగా నాలుగూళ్ళయిన యిమ్మనినాడు. ధర్మరాజున కక్కరలేదు. హస్తినాపురముతప్ప తక్కిన నాలుగు గ్రామములు నలుగురు తమ్ముల కిచ్చిన చాలునట.

దుశ్శా : నలువైపులనున్న నాలుగు దుర్గము లాక్రమించి మధ్య నున్న మమ్ము ముట్టడించి మట్టుబెట్టవలయునని వారితలంపు కాబోలు.

దుర్యో : ఆ భయము మాకులేదు. అయినా ద్రోణాచార్యులకు ఇంద్రప్రస్థము - కృపాచార్యులకు యమప్రస్థము దానము చేసితిమి. అవంతి కర్ణునకు వారణాసి భీష్ములకు దత్తము చేసితిమి. అవి వారివే! ఇచ్చినవి తీసుకొను నాచారము మాకులేదు. ఇకమిగిలినది హస్తినాపురము - కౌరవ సామ్రాజ్య ముఖ్యపట్టణము

నార : వాసుదేవా! మరే గ్రామములు పనికిరావా?

శ్రీకృ: వారా, సంగతి చెప్పలేదు.

నార : అవునులే! వట్టిగే వచ్చినదికదా అని చవిటి నేలను పుచ్చుకొన్నచో దానిని బాగుచేయుటకు తల తాకట్టు పెట్టవలయును.

దుర్యో : చవిటి నేల కాదు. వాడిసూదిమొన మోపినంత భూమియైనను ఇచ్చుట లేదు.

అశ్వ : రారాజా! ఆ నాలుగూళ్ళు కృష్ణునకే ఇచ్చితి మను కొనరాదా?

కర్ణు : గురుపుత్రా! ఇదంతయు నీతలపైనే ఉన్నట్లున్నదే!

అశ్వ : నాతలపై నెట్లుండును? కర్ణుని తలయేకదా భారతము.

కర్ణు : నిజము, కాకున్న భోజన ప్రియులకు చరిత్రమెట్లుండును.

అశ్వ : న్యాయచరిత్ర లేనిదానికన్న చరిత్రహీనతయే మేలు.

కర్ణు : న్యాయా న్యాయములింత బాగుగా తెలిసినవాడవు సిగ్గులేక గోగ్రహణమునకు వచ్చితివేల? ఘోషయాత్రకు రానేల? రాజత్వమునకు రాజ్యసంపాదనమే న్యాయము. యుద్ధము చేయవలసి వచ్చునని తిండి పోతులు బెదరినట్లుగా గుండెగలవారు బెదరరు. జంకిన వారికే కదా సంధి.

అశ్వ : రాధేయా ఇంకెంతకాల మాడెదవులే నీ బీరములు! అర్జునుడు గాండీవ నిర్ముక్త పాశుపతాస్త్రముతో

తరిమి తరిమి కొట్టినప్పుడు జ్ఞాపకము చేతునులే నీ వీరాలాపములు.

కర్ణ ; ఏకలవ్యుని విద్యానైపుణికి భయపడి గురుభక్తిపేరుతో శిష్యుని మోసగించిన నీ తండ్రికి-కులము కులమనుచు బలవంతులను ప్రక్కకు నెట్టు నీ మామకు తగినట్లుగనే చెప్పితివి, నీ తండ్రిద్వారా ఏకలవ్యుని-తన తండ్రి ద్వారా నన్నును వంచించిన అర్జునుడొక వీరుడా! స్వచ్ఛందముగా యుద్ధము చేయుటకు భయపడియేకదా అంత నీచమునకు దిగజారినాడు. వీరత్వమునకు నీతి నియమములు తోడు కావలయునయ్యా.

దుర్యో : ఇక నాచర్చ లనవసరము కృష్ణా! యుద్ధమున గెలిచినచో సమస్త ధరణీ రాజ్యమును-చచ్చినచో స్వర్గ సామ్రాజ్యమును ఏలుకొందుముగాని, సంధిమాత్రము చేయము.

శ్రీకృ ; దుర్యోధనా! ఒక్క మాట వినుము. ఈ సభయందు నేనుతప్ప తక్కిన వారెల్లరు నీ పక్షమేకదా.

నార : నేను తటస్థముగా నుందును.

శ్రీకృ: ప్రత్యక్షముగా నిందున్నవారి యభిప్రాయమును తీసికొందము. అదియే ప్రజాభిప్రాయముగా గైకొందము.

దుర్యో: అధిక సంఖ్యాకులు నా పక్షమువారే! అయినను ఇది ప్రజా సభ కాదు. ఇందు ప్రజా ప్రతినిధులు లేరు. ఈ

పక్షమే అధికసంఖ్యలో నున్నను రాజ్యాంగమునకు విరుద్ధముగా వర్తింపము. అదియునుగాక పరోక్షముగా ప్రజాభిప్రాయమును సేకరించుట జరిగినది. ప్రజాభిప్రాయము సంధికి వ్యతిరేకమని భీష్ములవారే ప్రకటించిరి. జయాపజయము లెట్లున్నను ప్రజాభిప్రాయము మన్నించుట మా విధి.

శ్రీకృ: పోనీ కర్ణార్జులను తులారణము జరిపింతమా ?

కర్ణు : మంచి అవకాశము. అంగీకరింపుము రాజారాజా !

దుర్యో: కర్ణా ! ఈ సుయోధనుడు కర్ణునిపై నాధారపడి బ్రతుకువాడని లోకులు చెప్పుకొనుట నీ కిష్టమా ! పాండవ రాయబారీ కర్ణార్జునులే అననేల ? భీమ దుర్యోధను లెందుకు చేయరాదు తులారణము ?

శ్రీకృ: ఆమాట వారు చెప్పలేదు.

అశ్వ : రాజరాజా! ఘోషయాత్ర జ్ఞాపకములేదా ? గోగ్రహణము మరచితివా ! ఇంకను పాండవులతో కయ్యమునకేల కాలుదువ్వెదవు? యుద్ధమే జరిగిన వారు జయించుట తథ్యము.

దుర్యో: ఆచార్యనందనా ! పాండవపక్షపాతముతో నట్లను చుంటివిగానీ ధనురాచార్యుడైన మీ తండ్రి సమానుడైన వాడెవ్వడు పాండవబలమందు? సకల శస్త్రాస్త్ర మంత్రతంత్ర పారంగతులైన కృపాచార్యునకు సాటి యెవ్వరున్నారు చెప్పుము, పరశురాముని జయించి

ఇచ్ఛామరణము సాధించిన భీష్మాచార్యు నెదిరించు వారున్నారా! రాధేయునకు ప్రతి యెవ్వరు పాండవు లందు! మనస్ఫూర్తిగా యుద్ధము చేసినచో నీవొక్క డవు చాలవా పాండవ సైన్య సరోవర వీర తామర షండములను మద మత్తేభముల వలె ఖండించి చెండాడుటకు! మీరందరు శాంతికై పాటుపడుట ముదావహమే! కాని అప్పనముగ అర్ధరాజ్యమిమ్మనుట శాంతి రాయబారమా? వంశసాంప్రదాయమునుబట్టి గానీ - దేశాచారమునుబట్టిగానీ పాండవులకు భాగ మెట్లు వచ్చును! యుద్ధమున చంపుదుమో చత్తుమో స్వాతంత్ర్య పరిరక్షణము మన ప్రథమ కర్తవ్యముకదా విరోధికి భయపడి మన భూ భాగమును వదలుకొనుట మన అసమర్థతను అంగీకరించుటయేకదా. సమ్మతమైన యుద్ధము చేయుమా. లేదా తిని కూర్చుండుము. అంతి యేగాని అశ్లీలము లాడకుము.

అశ్వ : రాజరాజా! కర్ణుని నమ్మి చెడిపోవలదుసుమా!

దుర్యో: ఆప్తులమని చేరవచ్చిన వారును - అప్పనముగా తిని వచ్చినవారును విశ్వాసహీనులై పాండవపక్షపాతముచే సంధి సంధి యని పలుకుచుండ వీరుడు - న్యాయ కోవిదుడు గావున కర్ణుడొక్కడు పౌరుషముగా నా మాటకు నిలిచినాడు. అతనిని నమ్మక మరెవ్వరిని

నమ్మగలను. నా చెలికాడు - చుట్టము - సర్వముతడే! తక్కినవారితో నాకు సంబంధములేదు.

అశ్వ ; సార్వభౌమా తెన్నగా నాలోచించి మాట్లాడుము.

దుర్యో: దుర్యోధనుని నిర్ణయమునకు తిరుగులేదు.

అశ్వ : అట్లయిన నీకొలువు నాకక్కరలేదు.

దుశ్శా: ఆచార్యనందనా! అంతఃకలహములు రేపక ఐకమత్యమును గూర్పుము నీకు మ్రొక్కెదను.

కర్ణ ; దుశ్శాసనా! గురుపుత్రుడని నమస్కరించిన - నమస్కరింతువుగాక అంతియేగాని అలిగినందులకు భయపడి మాత్రము నమస్కరింపకుము. ఆతడెంత! ఆతనికోపమెంత! నీవింక దైన్యము చూపుటకీ కర్ణుడు చావలేదు సోదరా!

అశ్వ ; ఓరీ! గర్వాంధకారా! ఇప్పుడే చత్తువుగాని [పెళ్ళబోవును]

దుశ్శా: అశ్వత్థామా! శాంతింపుము. [పట్టుకొనును]

కర్ణ ; రానిమ్ము దుశ్శాసనా! యేమిచేయగలడో చూతము.

అశ్వ; ఏమి చేయుదువా! పిడికిలితో నీతల ముక్కలు చేతును.

నార : పిడికిలితో ముక్కలుచేయుటకివి బూరెలాకుంద్రాళ్ళా!

దుర్యో: అశ్వత్థామా! పాండవుల పక్షమునకు బోవలయునన్న నిరాటంకముగా బోవచ్చునే. నిన్నెవరడ్డగింతురు! ఎందులకు నీకీ డొంకతిరుగుడు ప్రయత్నము!

అశ్వ : రాజా! కడకిదా నన్ను నీవర్థము చేసికొన్నది!

దుర్యో: అందరి సంగతియు నర్థమైనది. కృష్ణా! నీవు చెప్ప వలసినది ముగిసినదికదా! ఇంక నీ వరుగవచ్చును. సంధియను మాట లేదు. చేతనైనచో యుద్ధము చేయ మనుము లేదా తిరిగి అడవులకు పొమ్మనుము. సూది మొన మోపినంత నేలయైనను నిచ్చుట జరుగదు.

శ్రీకృ: దుర్యోధనా! దురభిమాన దురహంకారములకులోనై నీ వంశముతోబాటు సామంతుల వంశములను ప్రజ లను బలిచేయకుము. నామాట విని సంధిచేయుము.

దుర్యో: సంధిమాట మాని మరేదైనా కోరుము. మన్నిం తుము. భీష్మ ద్రోణ కృపాశ్వత్థామా రాధేయాది అతిరథ మహారథులుగల మాకు యుద్ధమునందోడుదు మని భయములేదు. ఓడినను సాంప్రదాయవిరుద్ధముగా పౌరుష హీనముగా సంధి చేయము.

శ్రీకృ: దైవదత్తములైన హయంబులను పూన్చినరథముపై కపిరాజ లాంఛితమైన విజయపతాక మెరుగుచుండ - ముక్కోటి దేవతల మొక్కులందిన నేను సారథినై తేరు నడుపుచుండ - పరసైన్యములు సొమ్మసిల్లు నట్లుగా దేవదత్త పాంచజన్యములు మ్రోగుచుండ - ధనుష్టంకార శబ్దశ్రవణమాత్రమున గజతురంగములు గుండెలవిసి చచ్చుచుండ - అర్జునుడు గాండీవ నిర్ముక్త కార్ముక ధారాపాతముతో మీ సేనను చీల్చి చెండాడుచుండ యీ కర్ణుడు - భీష్ముడు-ద్రోణకృపా

శ్వత్థామలు ఏమి చేయగలరో చూచెదముగాక! వేయి మంది భీష్ములు పదివేలమంది కర్ణులు వచ్చినను సవ్యసాచి చేతిలో చచ్చుట నిక్కము.

శ్రీ

దుర్యో : అధిక ప్రసంగములు చాలింపుము.

శకు : కృష్ణా! నీవెంత మొత్తుకొన్నను ఇప్పుడు సంధి చేయుట కల్ల.

శ్రీకృ ; ఇప్పుడు చేయరా సంధి! మరెప్పుడు చేయుదురు సంధి! ఆనాడా సభలో మీరు పాండవ పత్నిని భంగ పరచినపుడు భీమార్జునులు తాము పట్టిన ప్రతినలు యుద్ధరంగమున నెరవేర్చుకొనునపుడు చేయుదురా సంధి! ఎప్పుడు చేయుదురు సంధి! భీముడు దుశ్శాసనుని రొమ్ముపగిల్చి ఆ వెచ్చని నెత్తురుతో రాజసూయావబృథాభ్యంజన స్నానముచే పవిత్రమైన పాంచాలి కురులకు కౌరవకరస్పర్శచే నంటిన కళంకమును కడిగి వేణీ సంహారము చేయునపుడు చేయుదురా సంధి! ఎప్పుడు చేయుదురు దండధర చండ ప్రచండ దోర్దండ సన్నిభ గదాదండముతో భీముడు దుర్యోధనుని తొడలు విరుగ గొట్టి నప్పుడుచేయుదురా సంధి! ఎప్పుడు చేయుదురు సంధి!

దుర్యో; కృష్ణా! రాయబారివి గావున నీమదోన్మత్త వలాప ప్రల్పదములు ఆలించి పాలించి సహించి సైరించితిని. రాయబారిగా వచ్చిన వాడవు నీ యిష్టము వచ్చి

చున్న కుంతి కడుపున భూలోకమున పుట్టమందువా! మిగిలిన యీ ఒక్క కవచముతోను భూమికి నెట్టు చుంటివా? ఏమిటి ? నరనారాయణులు కృష్ణార్జునులు గాను - సువర్ణహస్తుడు దుర్యోధనుడుగాను భూమిపై జన్మింతురా! కృష్ణార్జునుల చేతిలో నా చావుతప్పదా! సరియే! నా మంత్రదండము దొంగిలించిన యీసువర్ణ హస్తునిపై పగదీర్చుకొందును. శత్రువుగా నెదిరించి సాధింపలేకున్న మిత్రునిగా చరించి నాశనము చేయుదును. సెలవు ప్రభాకరా! అమ్మా కుంతీ! నన్నుబిడ్డగా స్వీకరింపుము. అమ్మా! అమ్మా! ఇది సూర్యభగవానుని ఆజ్ఞ అమ్మా!అమ్మా ! కుంతీమాతా ! [తొందరగా వెళ్ళిపోవును.]

స్పాట్ లైటు ఆరిపోవును. కొద్ది క్షణములకు లైట్లు వెలుగును. అందరును ఎవ్వటివలె తమ స్థానములందు కూర్చునియుందురు. కర్ణుడు మాత్రము తలవంచి కూర్చునియుండును.

శ్రీకృ ; రాధేయా! తెలిసినది కదా! ఏమందువు?

కర్ణు : కృష్ణా! నీకు తెలియని దేమున్నది? జరగవలసినదెట్లును జరుగక మానదు. రాజరాజైన కౌరవ ప్రాణమంగా నుంటికన్న కీర్తియైనను నాకు మిగులనిమ్ము.

దుర్యో : కర్ణా! యీ మాయలమారి గారడీకి లోబడితివా యేమి? ఇతనిని బట్టి యుక్కడగింతము. [లేచును]

శ్రీకృ : మూఢ దుర్యోధనా ! నీ దురహంకార మింకను పోలేదా? ఈ కృష్ణుడన నెవ్వరనుకొంటివి ? చూడుము.

[వెంటనే లైట్లు ఆరిపోయి స్పాట్ వెలిగి శ్రీకృష్ణుని పాదములపై బడి క్రమముగా పైకి లేచి శిరముపైకి వచ్చి నిలచిపోవును]

నారః (స్పాట్ లైట్ వెలగగానే] ధన్యోస్మి! దేవా ధన్యోస్మి! వాసుదేవా! నీ విశ్వరూప సందర్శనముచే వీరి జన్మములు తరింపజేసితివి. శాంతించుమయ్యా జనార్థనా!

అశ్వ : జగన్నాథా! ఆది మధ్యాంతరహితా! అవతార పురుషా! నిన్ను గుర్తించలేక దురహంకార గర్వాంధులైన కౌరవులను క్షమింపుము ప్రభూ! [దండకము] శ్రీవాసుదేవా! మహానంద భావా! సమస్తాండపిండాది బ్రహ్మాండ భాండంబు నన్నిండిసృష్టించి పోషించి అంతంబునొందించు విశ్వాత్మ! కాపాడుమా మమ్ము! కృష్ణా! నమస్తే! నమస్తేనమః

శ్రీకృ : అశ్వత్థామా! నీ రాజభక్తికి మెచ్చితిని. తిరిగి యుద్ధరంగమున కలిసికొందము. రమ్ము నారదా!

అశ్వ : ప్రణామములు కృష్ణపరమాత్మా!

[కృష్ణుడు నారదుడు వెళ్ళిపోవుచుండగా లైట్లు వెలుగును. తెర పడును. వెంటనే నారదుడు తెరబయట పాడు కొనుచు వచ్చును]

నార : గడుసరి నరుడా నిలిచి వినుము
ధనబలవరుడా తెలిసికొనుము
సాగవులే మీ యాటలింక
ఆగదులే పోరాటమింక ॥గడు॥

భూమంతా నీ ఒక్కడిదంటే! కామందుడవై మెక్కాలంటే
ముక్కుతాడు పడిపోతాది । డొక్కచీలి విడిపోతాది
ముక్కచెక్కలై నీకు దక్కకే పోతాది ॥గదు॥

ACC NO : 5555

నిజాయితీని మరిచేవంటే । సజావుగాను మనలేకుంటే
తలకు ముసుగుపడిపోతాది । ఇలకు దాసగు మూడిపోతాది
జలధిపొంగులో సర్వమేకమై పోతాది ॥గదు॥

Rs. 6=00

(పాటపూర్తి కాగానే నారదుడు వెళ్ళిపోతాడు)

894.8132
NAR

—: మంగళమ్ :—

—:o:—